శ్రీ

# శాతకర్ణి

(చారిత్రిక నవల)

రచయిత :

ఆచార్య కురుగంటి సీతారామయ్య, M.A.,

రిటైర్డు ప్రొఫెసర్, నిజాం కాలేజి.

పబ్లిషర్స్ :

అజంతా పబ్లికేషన్సు,

సికిందాబాదు.

1950

శ్రీ

# శాతకర్ణి

(చారిత్రిక నవల)




రచయిత :

ఆచార్య కురుగంటి సీతారామయ్య, M.A.,

రిటైర్డు ప్రొఫెసర్, నిజాం కాలేజి.

# పరిచయము

దక్షిణాపథ చరిత్రమునందు సాతవాహన వంశము ప[illegible]
పాలించినకాలము మహోజ్జ్వలమగు యుగము. అందున[illegible]
పూర్వ సాతవాహన రాజులకాలము మిక్కిలి ముఖ్యమైన
విద్యార్థు లిట్టిఘట్టముల పరిచయము కలిగియుండుట వా[illegible]
నీయము.

ఆచార్య శ్రీ సీతారామయ్యగారు భాషాకోవిదుల
సాతవాహనయుగ చరిత్రమును విశేషముగ పరిశోధించినవార[illegible]
పూర్వ సాతవాహనులలో నగ్రగణ్యుడగు సాతకర్ణి మ[illegible]
రాజు జీవిత మీగ్రంథముయొక్క ఇతివృత్తము. కల్పన
సముగ నున్నది. భాష నిర్దుష్టమును, సరళమునై, పా[illegible]
లోని పై తరగతుల విద్యార్థులకు సులభగ్రాహ్యమైనది.

ఈ పుస్తకము సర్వవిధములను విద్యార్థులు చది[illegible]
వలసినది. దీనిని రచించిన ఆచార్య శ్రీ సీతారామయ్య[illegible]
అభినంద్యులు.

నిజాం కళాశాల
హైదాబాదు.
10—10—1950.

హరేమంద రామారావు

# తొలిపలుకు



శాతకర్ణి శాతవాహన చక్రవర్తులలో గొప్పవాడు. ఆయనకు దక్షిణాపథపతియను బిరుదముండెను. శాతవాహన యుగమునకు సంబంధించిన నవలలరుదుగానున్నవి. కావుననే నీయుగము నెత్తుకొంటిని. శాతకర్ణిపై ఖారవేలుడు దండెత్తి ముషికనగరమును బెదిరించినట్లు హాథిగుంఫ శాసనమునందు కలదు. ఆశాసన వృత్తాంత మీనవలకు బీజము. శాతకర్ణి ఖారవేలునకు మగధపై దండెత్తుటలో సాయపడెననునదికూడ చారిత్రికమే. ఈ రెండు నాధారముగాచేసి యీకథ నల్లితిని.

విద్యార్థులకు, అందును ఉన్నతతరగతివారికి మహోజ్జ్వలమైన శాతవాహన యుగమునుగూర్చి తెలియుట యవసరము. ఆంధ్రుల సామ్రాజ్యములలో శాతవాహనసామ్రాజ్యము మొదటిదియు, మహోన్నతమైనదియు. అట్టిదానినిగూర్చి యేకొలదియైనను విద్యార్థులకు తెలిసిన నేను కృతార్థుడ నగుదును.

విధేయుడు,

హైదరాబాదు-దక్షిణ 12-10-50.

కురుగంటి సీతారామయ్య

శ్రీ

# శాతకర్ణి

## పూర్వరంగము

క్రీ. పూ. 200 సంవత్సరముల నాటికే యాంధ్ర శాతవాహన సామ్రాజ్యము దక్షిణా పథమున తూర్పు సముద్రము నుండి పశ్చిమ సముద్రమువరకును, నుత్తరమున వింధ్యపర్వత పాదమునుండిదక్షిణమున తుంగభద్రానదియొడ్డువరకు వ్యాపించి యుండెను. ధాన్యకటక నగరము ముఖ్య రాజధాని. రాజ్యము విశాలమగు కొలది విభజింపబడి పశ్చిమమున పైఠనునగరమున నొక రాజప్రతినిధియు, దక్షిణమున ముషిక నగరమున నొక రాజప్రతినిధియు చక్రవర్తికిగాను పాలించు చుండిరి.

మనకథ క్రీ. పూ. 170 యేండ్లనాటిది. అప్పటికి శాతకర్ణి చక్రవర్తిగ నుండెను. ఆయన తండ్రియగు కృష్ణ శాతవాహనుడు విశాలరాజ్యము నార్జించి చనిపోగా ఆయన పెద్దకుమారుడు శాతకర్ణి చిన్నవాడగుటచే తల్లియగు నాగానికా మహాదేవి రాజ్యపాలనము చేయుచు, నాసిక ప్రాంతమున ననేక యాగముల నాచరించి రాజ్యమును సుప్రతిష్ఠితమును చేసి గతించెను. ఈమె చేసిన యాగములలో బ్రాహ్మణుల కిచ్చిన దక్షిణలును, చేసినదానములును, ప్రజలకిచ్చిన వరదానములును నాసికయందున్న శిలాశాసనమున పేర్కొనబడి యున్నవి. ఈమె కుమారడగు శాతకర్ణికి మహారాజోచిత విద్యలను గరపించి, యాయనకు పరిపాలనానుభవము కలుగజేయుటకై

పైఠను నగరమున రాజప్రతినిధిగా నుంచి తాను పైన కనిపెట్టి దేశమును సుభిక్షముగా పాలించెను. ముషికనగరమున తన మేనల్లు నీమె రాజప్రతినిధిగా నియమించి యాప్రాంతమందు పాలనము చేయించెను. ఇద్దరిని చెరియొక పట్టణమున నియమించినవెనుక తానుధాన్యకటకమునుచేరి సుఖసత్కథావినోదములచే కాలము గడపెను. ఈమె నామమన్న యావదాంధ్రసామ్రాజ్య ప్రజలు జయ గౌరవములతో నుచ్చరించు చుండిరి. ప్రజల సౌఖ్యముకొరకీమె చేసిన వ్యవస్థ లాధునికులకుగూడ నాశ్చర్యమును కలిగించును. రాజ్యమునందలి యన్నిమూలలకును ప్రయాణ సౌకర్యముల కొరకై మహారాజ పథముల నేర్పరచియు, పాఠశాలల నెలకొల్పియు, వైద్యాలయముల స్థాపించియు, ప్రజలను కన్నబిడ్డలవలె కాపాడుచు రాజ్యమును శత్రుదుర్నిరీక్ష్యముగ పాలించెను. అట్టియొక మహారాజ పథము హైద్రాబాదు రాజ్యమునందలి కొండాపురము, పణిగిరి యను నగరముల మీదుగా పోయెను. ఈకాలమున వింధ్యపర్వత శ్రేణికి దక్షిణముననున్న విశాలదక్షిణాపథములో కళింగమున చేదిరాజవంశముతప్ప చెప్పుకొనదగిన రాజవంశము లేదు. సుంగవంశీయుడైన పుష్యమిత్రుడు పాటలీపుత్రమున రాజ్యమేలుచుండెను. అతని రాజప్రతినిధియు నాయన కుమారుడగు నగ్నిమిత్రుడు మధ్య ప్రాంతమునందలి విదర్భ మాళవ దేశములను వరదానది యొక్క యుత్తరతీరము సరిహద్దుగా పాలించుచుండెను. దక్షిణమునకు వ్యాపింప నెంచెను గాని శాతవాహన చమూసందోహమునకు భయపడి ముందడుగు వేయ సాహసింప లేకపోయెను.

శాతవాహన సామ్రాజ్యము సమస్త పరిశ్రమలకు నాలయంబై సమస్త వస్తుసంపదతో తులదూగు చుండెను. తూర్పు పరగణాలు జనసమూహ మెక్కువగ నుండుటచే పరిశ్రమలకు ముఖ్యస్థానము లయ్యెను. ఇచ్చట నేయబడిన పాము కుబుసములవంటి వస్త్రములును, వానిపై వివిధరంగుల యద్దకముగల చీరలును, నింకనుబొమ్మలు మొదలగు నితర పరిశ్రమలయందు తయారైన వస్తువులును మహారాజపథములద్వారా పశ్చిమ తీరమున టగారా పట్టణము మీదుగా బారుకచ్ఛము మొదలగు రేవు పట్టణములకు చేర్చబడి యచ్చట పరదేశములకెగుమతి యగుచుండెను. తూర్పు తీరమునందున్న మత్స్యపురము, మోటుపల్లి మొదలగు నోడరేవులనుండికూడ బ్రహ్మదేశము, కాంభోజము, బలి, మధుర, మొదలగు విదేశములతో గొప్ప వర్తకము జరుగుచుండెను. తూర్పు పశ్చిమ తీరములందలి రేవుపట్టణములలోని యగారములలో నీసరుకులు నిల్వయుంచబడుచుండెను. గ్రీసు, రోము, ఈజిప్టు మొదలగు దేశములనుండి వర్తకులు వచ్చి ఈసరుకులనుకొని తమ దేశములకు గొనిపోవు చుండిరి. అప్పటి దేశసంపదను, పెరిప్లసు, టాలెమీ మొదలగు ననేక చరిత్ర గ్రంథములలో కాననగును. ఒక కాలమున రోమును పరిపాలించిన 'అగస్టసు' అను చక్రవర్తి యాంధ్ర దేశమునుండి వచ్చు వస్త్రములకు రోములో నున్న గిరాకిని, వానిని కొనుటకై తన నగరవాసులు వెచ్చించు ద్రవ్యమును నోర్వలేమిచే నాంధ్ర దేశమునుండి బట్టలను దిగుమతి చేయకూడదని యాజ్ఞాపించెను. ఈకాలపు రోమునాణెములు చిన్నగంజాం మొదలగు ననేక తూర్పు తీరపు స్థల

ములలో దొరికినవి. ఇట్లు సమస్తవస్తు సమృద్ధమై, సమస్త సస్యాకీర్ణమై, సమస్త సౌఖ్యాకరమై, తృప్తులగు ప్రజాసమూహముగల సామ్రాజ్యమునకు శాతకర్ణి వారసుడయ్యెను. ఇది మనకు పూర్వరంగము.

## ఒకటవ అధ్యాయము.

ఒకనా డొక యాశ్వికుడు నురుగుల గ్రక్కుచు, శరీరము చెమటచే తడిసి యార్చుచున్న గుఱ్ఱము నెక్కి పైఠను నగర రాజవీథిని వెళ్ళుచుండెను. ఆతని తొందరను చూచి జనులు పిల్లలను వీథులలో నుండి తొలగించు వారును దూరమున గుఱ్ఱపు గిట్టలను వినియె దారితొలగు వారును, 'ఇంత తొందర యేలనో' యని యాశ్చర్య పడువారును, 'తప్పక తొందరపనియేదైన యుండు'నని నిశ్చయించు వారును నైయాయాశ్వికునితదేకనిష్ఠతో తమసమక్షము తొలగువరకును చూచుచుండిరి. ఆశ్వికుని దుస్తులు శాతవాహన సామ్రాజ్య చిహ్నములు కలిగియుండుటచే పట్టణమందలి రాజభటులును నతని నివారింపరైరి. ఆశ్వికుడును రాజభవనము నొద్దకు పోయి ద్వారముకడ గుఱ్ఱమునుండి దిగి యచ్చటనున్న యొక కావలిభటునకొక సైగచేసెను. వెంటనే యాభటుడు వచ్చి గుఱ్ఱపు కళ్లెము నాశ్వికుని చేతినుండి తీసుకొనెను. అంత నాశ్వికుడు బిరబిర లోనికేతెంచెను. ప్రాసాదమువద్దకు పోయి యచ్చటి కావలివాని చెవులో నేదో యూదెను. అతడును వెంటనే లోపలికి వెళ్లి తిరిగివచ్చి యాశ్వికుని రాజదర్శనమునకు లోనికి గొనిపోయెను. ఆశ్వికుడును శాతకర్ణిచేతికొక తాటియాకు

కమ్మ నందించెను. దానిని చూచుకొను చుండ రాజు కన్నుల నీరు కారసాగెను. చుట్టునున్న వారందరును నిరుత్తరులై, యొకరి మొగమొకరు చూచుకొనసాగిరి. సుమంతుల వారిని బిలువమని యాజ్ఞాపింప నొక ప్రతీహారి మంత్రివరుని బిలచుకొనివచ్చెను. శాతకర్ణి బాష్పపూరిత నయనములతో సుమంతుల వారిని గనుగొని,

"బాబాయిగారూ! అమ్మగారి శరీరస్థితి ప్రమాదకరముగా నున్నదనియు, వెంటనే నన్ను రావలెననియు, నాజ్ఞ చేసినారు. ప్రయాణమునకు సర్వము నాయత్తపరుపుడు. అక్కడి పరిస్థితులనుబట్టి నేను తమకు సవిస్తరముగా వ్రాతును. అమ్మగారి కెట్లుండునోయని హృదయ మావేదన పడుచున్నది. సమస్తమును దైవాధీనము" అని శాతకర్ణి యనెను. మంత్రియు విన్నబోయి, "మహారాణిగారు తప్పక పునరారోగ్యవంతు లగుదురు. తమ రధైర్యపడ నవసరములేదు. మరియు తమరుకనపడినశ్రీవారికి జాడ్యము తిరుగుమొగముపట్టును. అనెను. "ఏమో! దైవమేమిచేయనున్నాడో! ఒక విషయమున నప్రమత్తులమై యుండవలెను. అమ్మగారి వద్దకు నేనుపోయిన యవకాశమును పురస్కరించుకొని వరదానది యవ్వలి యొడ్డున పొంచియున్న యగ్నిమిత్రుని నొకకంట కనిపెట్టి యుండవలెను." అని శాతకర్ణి యనెను.

"చిత్తము. తమ యాజ్ఞ శిరోధార్యము. ఇప్పటికే యచ్చట మన రాణువు తగినంత కలదు." అని మంత్రియనగా శాతకర్ణి,

"అన కూడదుగాని కీడెంచి మేలెంచుట రాజనీతి. అమ్మగారు ఆరోగ్య వంతులైన సరే! అట్లుగాక విపరీత మేమైన కల్గనేని సమయమునకై వేచియున్న యంతర్బహిశ్శత్రువులు విజృంభింప సమకట్టుదురు. కాబట్టి నేనిచ్చట లేనిలోపము కలుగకుండ సరిహద్దులను కంటికి రెప్పవలె కాపాడుచుండ వలయును. అచ్చటి పరిస్థితులు విషమించినచో నే నిచ్చటికి రాక నే పోవచ్చును. ఇచ్చటికి మరియొక రాజప్రతినిధి నియమితుడగువరకు భారమంతయు తమపై నున్నది. తమ దూరదృష్టి, రాజనీతి, నాకు తెలియనిదికాదు, అయినను చెప్పవలసివచ్చి చెప్పితిని" అనెను. అంగీకారసూచకమగు మంత్రిముఖమును శాతకర్ణి చూచి,

"సుమంతులవారూ! నాకేమో హృదయము కంపించుచున్నది. ఒక వైపమ్మగారి భవిష్యత్ స్థితియు, మరియొక వైపున విపరీత మగునెడ కలిగెడి పరిణామమును మనంబును కలచుచున్నవి" యనుచుండ రెండు కనుకొలకునుండి రెండశ్రుబిందువులు రాలెను. సుమంతులవారును నోటమాట రాక యతికష్టముతో 'ప్రభూ! తమరే యిట్లుబేలతనమువహించిన తమ యుపజీవులమగు మాకు గతేమి?" యనుచు శిరమువంచి యూరకుండెను.

తెల్లవారుజామున శన్యుషస్సున ప్రయాణమును నిశ్చయించిరి. అశ్వశకటముల నాయత్తపరుపుమని యాజ్ఞల నొసగిరి. త్రోవలో టగారా, కొండాపురము మొదలగు మహారాజ ధమునంలి మజిలీల కంచెగుఱ్ఱముల నాయత్తపరచుట కాజ్ఞ

లంపబడెను. రాత్రియంతయు యావన్నగరము ప్రయాణ సన్నాహ కార్యములతో నిండెను. రాజ పరివారమునకు కావలసిన యశ్వ శకటములు తయారుచేయుట, కూడపోవు వారికి కావలసిన యావత్సన్నాహములు చేయుట మొదలగు సమస్తకార్యములును సర్వాయత్తము లయ్యెను. ముందుగా మొదటి మజిలీకాఁడ్లు వెడలెను. శాతకర్ణియు పెందల కడనే బ్రాహ్మ ముహూర్తమునలేచి కాల్యకృత్యముల దీర్చికొని సిద్ధముగ నుండెను. రాత్రియంతయు నిద్రలేక పోవుటచేతను, తరుచు కన్నీరుకార్చుటచేతను కన్నులెఱ్ఱనయ్యెను. అశ్వశకటము నెక్కుచు శాతకర్ణి మంత్రితో మరల నొకమాఱు తాను చెప్పిన సంగతులు మఱచిపోవలదని గట్టిగాచెప్పి శకటారూఢుండయ్యెను. సుమంతులవారును ఏలికకు నచ్చుచెప్పిన తర్వాత బయలుదేరు చుండగా శాతకర్ణి మంత్రిని మఱల పిలిచి,

"నేను ధాన్యకటకమునుచేరి యచ్చటి సందర్భములను తమకు తెలుపుదును. అవసర మున్నయెడల తమరు ధాన్యకటకమునకు రావలసి యుండును." అని చెప్పినవెనుక బండిబయలు దేరెను. శాతకర్ణి వెళ్ళుటచే పైఠను నగరమంతయు చిన్నవోయెను.

## రెండవ అధ్యాయము.

ధాన్యకటకపురలక్ష్మి దుఃఖ యవనిక కప్పుకొనెనా యన్నట్లు పట్టణమంతయు నెచటికి పోయిన నెవరి ముఖమునను సంతోషరేఖ కానబడుటలేదు. ప్రతి చతుష్పథమునను,

వీధికోణములను ప్రజలు గుసగుసలాడు చుండిరి. అందఱి ముఖములు నేమగునో యను నాతురతతో నుండెను. మహారాణి యారోగ్యమునకు దేవాలయముల పూజలు సలుపుచుండిరి. ఇదివరలో వీధినాటకములతో నిండియుండెడి వీధుల నట్టి వెచ్చుటనుగానరావు. జీవితావసరములగు నాహార పదార్థములు తప్ప యంగడుల బేరసారములు లేవు. రాజ భవనమున నొకచోట సూర్యనమస్కారములును, మఱియొక చోట నవగ్రహ జపారాధనములు జరుగుచు తీర్థములు మహారాణి యారగింపునకై పోవుచుండెను. పట్టణమునందలి, రాష్ట్రమునందలి భిషక్ శ్రేష్ఠులందఱును రాజ భవనముననే యుండిరి. నిముస నిముసమునకును రాజ భవనమునుండి యేదో యొక కార్యమునకు పరిచారికా బృందము బయటకు లోప లకు వెడలుచునే యుండెను. 'మహారాణి కెట్లున్నది?' యను ప్రశ్నకర్థోక్తులేగాని పూర్తి సమాధానము లెవ్వరివద్దనుండియు లేవు. మహారాణి రుద్రభట్టారకుల బిలచి,

'అబ్బాయిజాడ యేమైన తెలిసినదా? నా యంతము దగ్గరించుచున్నది.' యనెను. రుద్రభట్టారకులును, 'అమ్మా! ఎనుబది యామడలు గడవలయును గదా? వచ్చుచుందురు.' అనుచు మహారాణి నాడీపరీక్షచేసి, 'తమ కిప్పుడేమియు భయ ములేదు' అని ధైర్యము చెప్పెను. కాని, మహారాణి "వర్ష పురాకయు, ప్రాణిపోకయు నెవ్వరికి తెలియును? కర్తవ్య మును పూర్తిచేసుకొని యాసన్న మృత్యువునకు సిద్ధముగ నుం డుట కర్తవ్యము. తాళపత్రమును తెప్పించుడు" అనగా భట్టార

కుల యాజ్ఞపై కంచుకి తాళపత్రము నొక దానిని తెచ్చి, భట్టారకులవారి కందిచ్చెను. అంతట పైడిగంటమును తీసుకొని మహారాణి చెప్పగా భట్టారకులు వ్రాయ మొదలిడిరి.

"శాతవాహన సామ్రాజ్ఞి నాగానికా మహాదేవి వ్రాయించిన మరణశాసనము. నాకు మృత్యువాసన్నమైనది. నాపుత్రులలో శాతకర్ణి జ్యేష్ఠుడు. ఈసామ్రాజ్యపు ధర్మమును పురస్కరించి ఆయనయే నాతరువాత చక్రవర్తి కావలయును. ఆయన యవివాహితు డగుటయు, సింహాసనారూఢు డగు కాలమునకు గృహస్థు కాకపోవుటయు శోచనీయమే. కాని యిపుడావంక చేయునది యేమియు లేదు. పరిపాలనానుభవము చాలవరకు కలిగి యుండుటచే నాకు కొంత మనశ్శాంతి చేకూరినది. అయినను కొన్ని విషయములలో సూచనల నిచ్చుట నావిధి. ప్రజలు రాజ్యమున కేడుగడ. కావున ప్రజాక్షేమమే రాజక్షేమము. ఒక్క పౌరుడైనను నసంతృప్తుడు కాకుండు నట్లు రాజ్య మేలుట విధి. ఈ విషయమున ప్రమత్తత తగదు. ప్రజాసంస్థల మూలమున ప్రజాహితము నారసి వారికి యావత్సౌకర్యములను చేయవలెను. ప్రజకు కావలసినది యన్న వస్త్రగృహవైద్య సౌకర్యములు. వీనినన్నిటిని పూర్తిగా కలుగజేసిన దేశము సుభిక్షముగా నుండును. ప్రజలు సుఖింతురు. కావున నీనాల్గు విషయముల నే కొరతయును చేయరాదు.

సుఖులైన ప్రజలు సామ్రాజ్యమున కాపదలు రానున్నపుడు తమకు తామే సాయపడి యేవచ్చిన యాపదలను తొలగింప ప్రాణములైనను విడతురు. మన సామ్రాజ్యము

విశాలమైనది. అగుటచే నెంతకష్టించియైనను సమస్త భాగము లలో ప్రజలక్షేమము నారయుట ముఖ్య కర్తవ్యము. సుంక ముల పోగుచేయుటలో గాని యితర ధన సేకరణలో గాని ప్రజల కెట్టి మనస్తాపమును కలుగరాదు. అతివృష్టి యనావృష్టిదోష ములను కనిపెట్టి పంటలకు కావలసిన నీటి సౌకర్యములను కలు గజేసి యాహారోత్పత్తికై సమస్త కార్యముల నిర్వర్తింప వలెను. సామ్రాజ్యోద్యోగులను కూడ సంతృప్తులనుగా చేయ వలెను. దండ్యులను విడువ కూడదు. అదండ్యులను దండింప కూడదు. ప్రజా సుఖమున్న చోరాదిబాధలుండవు. ఈవిధము గా సమస్త ప్రజాలోకమును ననురక్తులుగ చేసుకొనవలెను.

ఆదినుండియు మన సామ్రాజ్యమునకు పరమతసహనమే పునాది. కీ. శే. మీతాతగారి కాలమునుండి మనము వైదికా చార సంపత్తి కలవారము. నా కాలమున నందులకు భిన్న ముగా నడువలేదు. అనేక యాగకర్మల నాచరించితిని. కాని యెన్నడును పరమతములవారి పీడయన్న మనకు గిట్టదు. మన సామ్రాజ్యమున జైనులు, బౌద్ధులు, శైవశాక మతములవారు, వైదిక మతానుయాయులు నన్నదమ్ములై మెలగు చున్నారు. ఇది మన సామ్రాజ్య సంప్రదాయము. దీనిని కాపా డుట పరమధర్మము. మతమునకును రాజకీయములకును సంబంధ ముండరాదు.

మన సరిహద్దులలో దక్షిణమున మనకు భయములేదు. కాని ప్రాగుత్తరములలో కొలది ప్రమాదము కలదు. తూర్పున చేదిరాజు రాజ్యవిస్తరణకాంక్షతోనున్నట్లు కనిపించును. ఉత్త

రమున మగధ సామ్రాజ్యము వంక భయములేదు. అదిచేతులు మారుచు నొక వంశమున కంటిపెట్టుకొని యుండలేదు. అగ్నిమిత్రుడు విషయలోలుడు. భయము లేకపోయినను ప్రమత్తత తగదు. చేదిరాజును మాత్రము కనిపెట్టి యుండుట యవసరము. చక్రకోట్య దేశాధీశుడు చేదిరాజునకు బావమరది. అందుచే నాయన నొక కంట కనిపెట్టుట యవసరము. గోదావరీతీరమున నున్న మన స్థావరములను జాగ్రత్తగా నుంచుట యవసరము. సీమలనుగూర్చి ప్రమత్తత తగదు. సీమలభద్రత దేశభద్రతకు మూలభూతము.

చేదిరాజులది జైనమతము. అయినను మనకు వారు శత్రువులుకారు. వారితో స్నేహ సంబంధము లుంచుకొనుట యవసరము. ఒకటి మాత్రము నాకు చాల కాలమునుండి మనసునకలదు. చేదిరాజుతో బాంధవ్యము కలిగించుకొని యాయన కుమార్తెను శాతకర్ణికి చేసుకొని సామ్రాజ్యము నిష్కంటకముగ గట్టిపరచు కొనవలెనని యుండెను. కాని యది జరగకపోయెను. ఆపని యుభయతారకము. రెండు రాజ్యముల కును నుపకారకము. సుమంతులవారును, రుద్రభట్టారకులును, అబ్బాయితో సంప్రదించి యీవిషయమున తగు నాలోచనము చేయవలెనని నా యభిమతము. సామ్రాజ్య సంప్రదాయరక్షణము పవిత్రకార్యము. సామ్రాజ్యమునకు కావలసిన యష్టాంగములును పూర్ణముగ గలవు. ఆవంక నాకు మనస్తాపము లేదు. తల్లిదండ్రుల మార్గముననే శాతకర్ణియు వర్తిల్లవలెనని నా యనుమతము. నామనస్సును తెల్పితిని. ఇక మృత్యువు కొ

ర్తకై మనశ్శాంతితో వేచియుండుట తప్ప నాకితర కర్తవ్యము లేదు. సామ్రాజ్యము చిరస్థాయి యగుగాక. శాతకర్ణి దీర్ఘాయువై చిరకాలము పుత్రపౌత్రాభి వృద్ధి కలిగి రాజ్యమేలి కీర్తి బడయుగాక." అని వ్రాయించి ప్రోలియుంగరపు ముద్ర వేయించెను.

వ్రాత పూర్తియైన కొలది కాలములో ద్వారము కడ గుఱ్ఱముల గిట్టల చప్పుడు వినబడెను. యువరాజు వచ్చెనని గుసగుసలు బయల్వెడలెను. శాతకర్ణియు బండిదిగి యచ్చటి ప్రజయున్న నిశ్శబ్దతకు భయపడి గుండెలు కొట్టుకొనగా లోపలికి వచ్చుచు 'అమ్మగారి స్థితియెట్లున్నదో ?' యనుకొనుచు నెప్పుడెప్పుడు మాతృశ్రీ దర్శనముచేతునా యను నాతురతతో త్వరితగతి యంగణములను తలవంచుకొని దాటుచుండెను. ఎచ్చటనున్న దాసదాసీజన మచ్చట నక్కికుక్కరు మనకుండిరి. రోగి మందిరములోనికి పోగా రుద్రభట్టారకు లొకవైపున నాసీనులై యుండిరి. మహారాజ్ఞి కిప్పుడే నిద్రపట్టెననియు లేపవలదని వైద్యునియాజ్ఞ యనియు భట్టారకులు తెలిపిరి. శాతకర్ణియు శబ్దము కాకుండ నొక యాసనమును మహారాజ్ఞి మంచము కడకు తెచ్చి హస్తన్యస్త చుబుకుడై కూర్చొనెను. బిగ్గరగా శ్వాసనైన నెవ్వరును విడుచుట లేదు. 'మృత్యునిశ్శబ్దత'యన్న నిట్లుండును కాబోలు !

ఇంతలో మహారాజ్ఞి కన్నులు తెరచి శాతకర్ణిని చూచి యంత బలహీనస్థితిలో కూడ రెండు చేతులనెత్తి యాయన

చుబుకమును పుణికి, "వచ్చితివా నాయనా? ఇక నన్నెన్నటికి నను పరే!"యని బలహీన స్వరముతో ననెను. శాతకర్ణి నోట మాట రాలేదు.

"నాయనా! నీవు బుద్ధిమంతుడవు. పౌత్రుని ముఖదర్శనము చేయకుండ పోవుచుంటినని తప్ప నాకే యితర విచారమును లేదు. సుమంతుల వారును రుద్రభట్టారకులును చెప్పినట్లు మెలంగుము. మన సామ్రాజ్యమునకును వంశమునకును కూడ వారిద్దరు నాప్తమిత్రులు. నా యాశయములను భట్టారకులచే వ్రాయించితిని. దానిని చదువుకొనుము. నాయభిమతమును తెలుసుకొని నిర్వర్తింపుము. దీర్ఘాయుష్యమస్తు" అను వాక్యముల నెట్లెట్లో యుచ్చరించి కండ్లు మూసికొని మరల లేచి "అబ్బాయీ! పసివాడవు. ఇక నీవిట నుండకూడదు. కర్తవ్య మంతయు భట్టారకులవారు చెప్పెదరు. నా కళేబరమునకు కృష్ణాతీరమున దహనాది క్రియ లొనర్పవలెనని నా యభీష్టము. పొమ్మ! ఈయుంగరము గ్రహింపుము. ఇక పొమ్ము!" అనుచు నుంగరమునిచ్చి త్వరపెట్టి పంపివైచెను.

శాతకర్ణియు నభ్యంతర మందిరమునకు పోయెనుగాని చిత్తమంతయు మాతృశ్రీ సమక్షముననే యుండుటచే చిత్తశాంతిలేక, యిటునటు తిరుగుచుండెను. ఈ పరిభ్రమణమే యాయన యాందోళనమునకు తార్కాణము. 'వేళయైనది. శ్రీవారు స్నానమాచరించి ప్రాశనము చేయుడు' అని కంచుకి వచ్చివిన్నవించెనుగాని యామాటలు చెవులబడలేదు. "మాతృశ్రీ తమను స్నాన మాచరించి ప్రాశనము చేయవలెనని

కోరుచున్నారు'' అని మరల కంచుకివచ్చి విన్నవింప, నిష్టము లేనివాడయ్యు మాతృశ్రీ యాజ్ఞోల్లంఘనము చేయ శంకించి, కాల్యకృత్యములదీర్చి రెండు మెతుకులను కొరికి త్రుళ్ళివారణ మొనర్చుకొనెను. మరలమహారాజ్ఞిని చూడవలెనని యున్నది కాని యామె నిషేధించుటచే ధైర్యము చేయలేక పోయెను. అనుక్షణము క్షేమవార్తలను మాత్రము తెప్పించుకొను చుండెను. వచ్చిన ప్రతి వ్యక్తియు మహారాజ్ఞి యింకను సజీవ స్థాయే యున్నారని తెల్పుటయేగాని గుణము తిరిగినదని కాని, భయము లేదనిగాని తెల్పరైరి. తనకు పునర్దర్శన మిచ్చుట కంగీకరించుటయే జాడ్యము వెనుక బట్టినందులకు నిదర్శన మని తలచెను. ఎన్నిమారులు మఱల చూడవలెనని యున్నదని కబురంపినను, వద్దువద్దనునాజ్ఞయేగానిరమ్మనువార్తరాదయ్యె. ఆరాత్రియంతయు నాందోళనముతో నిద్రాభావముతో గడపెను. ఆ దినము శుక్ల త్రయోదశి. తెల్లవారు జాముస చంద్రాస్తమయము తర్వాత జీవించిననిక భయము లేదని వైద్యులు తెలిపిరిగాని నమ్మకములేదని కూడ ననిరి.

చంద్రునకును మానవ ప్రాణములకును నేమి సంబంధ మోకాని సరిగా చంద్రాస్తమయము వేళకు కలకలము విన బడెను. శాతకర్ణి బయటకువచ్చి ఏమి యది యని యడిగెను. మహారాజ్ఞి యస్తమించెనను వార్త చెవులబడి పిడుగడచిన చందమున గూలబడెను.

తరువాత సంగతులన్నియు వివరింప నవసరములేదు. కర్మ లాపము లన్నియు యథావిధిని జరిగినవి. రాణి మరణించిన

వెంటనే శాతకర్ణి చక్రవర్తియైనట్లు అచ్చులందును రాజమార్గములందును ప్రకటింపబడెను. సామ్రాజ్యపు మూలలకుకూడ కబుర్లు వెడలెను. శాతకర్ణి కింత త్వరలో తాను చక్రవర్తిగా ప్రకటింపబడుట కిష్టము లేకపోయినను నరాజకము కాకూడదు కావున నియ్యకొనెను. రాజధర్మ మనుల్లంఘనీయము కదా! దారుణము కదా! నిర్దయము కదా!

## మూడవ అధ్యాయము.

శ్రీముఖనామ సంవత్సరాశ్వయుజ శుద్ధదశమీ శనివారమునాడు ధాన్యకటక నగరమున శాతకర్ణి పట్టాభిషేక మిందు వైభవముతో జరిగెను. పట్టణమంతయు నలంకరింపబడెను. ఎచ్చట చూచిన తోరణములే! ఏవంక పరికించినను నలంకృత జనసమూహములే! ఏవైపు తిలకించినను రంభాస్తంభ వినిర్మితములైన పందిళ్లే! సమస్త పుష్కరనదీ జలములన్ దెచ్చి సేకరించిరి. చీనావర్తకులువచ్చి పట్టువస్త్రముల దుకాణములను నెలకొల్పిరి. సామ్రాజ్యము నందలి నలుమూలల నుండివచ్చిన వస్తుజాలముతో విపణు లన్నియు ప్రకాశించుచున్నవి. రాత్రిజాము ప్రొద్దుపోయి చక్రవర్తి యూరేగింపు జరుగునని చాటింపబడెను.

ఆ వేళకు నగర మంతయు దీపావళీ మయమైయుండెను. రాజవీధుల కిరుపక్కలనుండు భవనము లన్నియు జనులచే కిటకిట లాడుచుండెను. 'నేనుముందుందును, నేనుముందు నిలతు'నను సహమహమికతో జనులుతోసుకొను

చుండిరి. వీథుల నిరుపార్శ్వములను సందులేకుండ జనులు నిలువబడి యుండిరి. ఎప్పుడు చక్రవర్తిని చూతుమాయని ప్రజలందఱు నమితోత్సాహ పరవశులై యుండిరి. వీథులవెంబడి యున్న చెట్లు చేమలు, ద్వారములు, మేడలు, మిద్దెలు, గవాక్షములు రాజదర్శనోత్సుకులగు ప్రజానీకము యొక్క నేత్ర సహస్రములతో నిండియుండెను. ప్రతిస్త్రీయు పురుషుడును తన వివాహమున కలంకరించుకొనెనా యనిన ట్లలంకరించుకొనిరి. ప్రతి చతుష్పథమునను ప్రతిద్వారము వద్దను ప్రజలు చక్రవర్తికి నీరాజనము లిచ్చుటకై పళ్లెరములలో కర్పూరాది సుగంధద్రవ్యముల నుంచుకొనియు, నాయన మెడను వేయుటకు పూలమాలలతోను సిద్ధముగ నుండిరి. చిత్రకారులు చక్రవర్తి చిత్రప్రతిమలను రాతితోను, పటములపైనను, చిత్రించి చక్రవర్తికి సమర్పించుట కుత్సుకులై యుండిరి. దేవాలయములలో శుభాకాంక్షల కొరకై చేయబడు పూజలలోని ఘంటారవము మ్రోగుచుండెను. కొందరు బాలికలక్కడ చక్రవర్తి గుణగణములను తెల్పుపాటల పాడుచు కోలాటములను వేయుచుండిరి. మతభేదములు లేకుండ సర్వమతానుయాయులును రాజబహూకరణ వాక్యముల నుచ్చరించుచుండిరి. వేదపాఠములందంద చెలరేగెను. ఆవేదపాఠక సమూహములు పూర్ణకుంభములతో రాజాశీర్వాద వచనముల నుచ్చరించుచు సమర్పించుటకు సర్వ సన్నాహములతో నుండిరి. సామ్రాజ్య సర్వభాగములనుండి యుత్సవమునకై వచ్చిన జనముల యొక్కయు, నధికారుల యొక్కయు సమూహము, రాజు నెప్పుడు చూతుమాయని యువ్విళ్లూరుచుండిరి.' చక్రవర్తి గజమునధి

స్తింబిచియే వచ్చునా? మనకు కనపడునో లేదో' యని ప్రజలు తహతహ పడుచుండిరి.

ఇంతలో "దారివిడువుడు" అని యరచు భట సమూహమును, తర్వాత భేరీ కాహళధ్వనులును, నందు వెంట నాగస్వరాది వాద్యములును, తదనంతరము కత్తిసాము వారి కత్తుల మిలమిలలును, తదుపరి లాస్యాంగనా సరససంగీత నృత్యములును, రాగా ననేక సువర్ణ రత్నఖచిత మాలాలంకృతంబైన యరుణాద్రి నామక మగు కుంభీంద్రముపై నమర్చబడిన శాతకుంభ నిర్మితమైన యంబారిమీద ప్రశాంత తేజో మూర్తియై సాక్షాత్ శ్రీమహావిష్ణువు లోకావనమునకై బయల్వెడలెనాయన్నట్లాసీనుడైయున్న శాతకర్ణి చక్రవర్తి ప్రజల దృష్టుల కానేచనకుడై కన్పట్టెను. ప్రజల చప్పట్లును, జయజయ ధ్వానములును మిన్నుముట్టెను. హర్మ్యములపై నెగురుచున్న శాతవాహన పతాకములు, 'భళిభళీ' యని తల లూపుచున్నవా యన్నట్లు వాతాహతములై యిటునటుకొట్టుకొనుచుండెను. ఊరేగింపు ముందునకు నడచిన కొలది వెనుకవా రప్పుడే చక్రవర్తి గడచెనాయని విన్నదనమును, ముందున్నవారు అదుగోయను సంతోషమును చూపుచుండిరి. ఇట్లాయూరేగింపు దర్శకులకు కన్నులపండువు సేయుచు కృష్ణాతీరముననున్న దేవాలయమునకు వెడలెను. అచ్చట చక్రవర్తి దిగి, వినమిత శిరస్కుడై దేవాలయమున ప్రవేశించి, దేవిని సేవించి, యర్చకులిచ్చిన తీర్థప్రసాదములను స్వీకరించి, దేవికి మ్రొక్కి, యాశీర్వచనములను గ్రహించి, నిర్మాల్యమును శిర

మున దాల్చి మరలవచ్చిగజారోహణ మొనర్చి, యూరిబయట నున్న మైదానమునకు వెడలెను.

అచ్చట నమర్చబడియున్న యాసనములపై, చక్రవర్తియు తత్పరివారమును నాసీనులైరి. పట్టాభిషేకాంగములుగా నేర్పాటు చేయబడిన పందెముల కొరకై సన్నాహములును సిద్ధమయ్యెను. మరియొక వైపున వస్తుప్రదర్శన మమర్చబడియుండెను. చక్రవర్తి సపరివారుడై యాసీనుడుకాగా పందెము లారంభమయ్యెనని తెల్పుటకుగాను, భేరీశబ్దమైన రెండు మూడు నిముషముల తర్వాత నాగిపోయెను. పందెముల కార్యక్రమమును, దేనితరువాత నేది జరుగునదియు ప్రకటింపబడెను. మొదటిది కుక్కల పందెము. 'అదుగో పులియడు ముందున్నాడు' 'బూచిగాడు దానిని దాటినాడు' 'హనుమంతు డింకను వెనుకనే యున్నాడు' 'అడుగో! భైరవు డందరిని మించినాడు' ఇంతవరకు వెనుకనున్న హనుమంతుగాడు మించుచున్నాడు' 'భైరవుడు హనుమంతుని మించుటకు వచ్చుచున్నాడు' అను కేకలు చెలరేగెను. తుదకు హనుమంతుడే పందెమును గెలువ 'హనుమంతుని వేగమున నెవ్వరోడించగలరు' అను మాటలతో పందె మంతమయ్యెను. ఈ విధముగా గుఱ్ఱపు పందెములు, పరుగు పందెములు, నాట్యపు పందెములు, శకటముల పందెములు, మొదలైన వన్నియు రిగినమీదట వాటిలో నెగ్గిన వానికి చక్రవర్తి స్వహస్తముతో బహుమానముల నిచ్చెను.

తరువాత చక్రవర్తి సపరివారుడై ప్రదర్శనమును తిలకింప వెడలెను. అచ్చట సామ్రాజ్యము యొక్క నలుమూలలలో

నున్న పరిశ్రమలలో తయారైన వస్త్రాదికములు ప్రదర్శింప బడెను. మరియు వివిధ శిల్ప వస్తువులుకూడ నుండెను. రాతి చెక్కడములు, పటచిత్రములు, తైలచిత్రములు, వర్ణచిత్రములు, ప్రతిమా చిత్రములు, సన్ననిరేఖా విన్యాసములుగల శిలాదారు తోరణ చిత్రములు మొదలగు సామగ్రి యంతయు వేర్వేరు స్థానములలో నిర్ణీతములై యుండెను. వానిలో రెండు శిలాప్రతిమ లన్నిటికంటె విశిష్ట లక్షణములు కలిగి యుండెనని పరీక్షకులు నిర్ణయించిరి. వానిలో నాగానికామహారాజ్ఞి ప్రతిమ యొకటి. చక్రవర్తి దానివద్దకు వెళ్లి పరీక్షించుచుండగా, రెండు నేత్రాంతములనుండియు రెండశ్రు బిందువులు వెడలెను. ప్రేక్షకులందరి ముఖములు విన్ననయ్యెను. 'ఎంత మాతృభక్తి'యని యచ్చటి వారెల్లరు తమలోతా మనుకొనిరి. దానిని చక్రవర్తి కొనదలచి 'ఎంత వెల'యనియా శిల్పి నడిగెను. 'ఇతరులకు వెలగాని నాయేలికకు వెలలే'దని యాశిల్పి సవినయముగా ప్రత్యుత్తరమిచ్చి, 'దీనితోబాటు శ్రీవారి శిలా ప్రతిమనుకూడ నుపాయనముగా గొనుడు' అని రెండు ప్రతిమలును చక్రవర్తి ముందుంచి బద్ధహస్తుడై నిలచెను. చక్రవర్తి వెంటనే సుమంతులవారితో నతని నాస్థానశిల్పిగా నియమింపుమని యాజ్ఞాపించెను. 'ఇందుశ్రీ యదృష్టవంతుడు' అని ప్రజలు తమలో తాము సంతసించిరి. ఇట్లు ప్రదర్శనమైన వెనుక చక్రవర్తి సపరివారుడై నాటకశాల కరిగి యచ్చట ప్రదర్శింపబడిన 'శ్రీరామ పట్టాభిషేకము' నాటకమును దర్శించి యానందించెను. అంతట పరివార మంతయు నాస్థాన మంటపమునకు తరలెను. అచ్చట రత్న సింహాసనాసీనుడైన

మునకు వెళ్ళిరి. 'ఏమో! చక్రవర్తి దృష్టినే కన్య యాకర్షించునో' యని వారియాశ. కాని ప్రయోజన మెంత మాత్రము లేకపోయెను. వియ్యమునకును కయ్యమునకును సమాన ప్రతిపత్తి కావలెను కదా!

పట్టాభిషేకము ముగిసిన మరునాడు చక్రవర్తి సుమంతులవారిని, రుద్రభట్టారకుల వారిని, రావించి యంతర్మందిరమున మంత్రాంగసభ గావించెను. అచ్చట నేమయ్యెనో ఎవరును చూడ లేదుగాని, కర్ణాకర్ణిగా తెలిసిన కొన్ని వివరముల నిత్తుము. భట్టారకులు నాగానికా మహారాజ్ఞి మరణ శాసనము చక్రవర్తి కర్పించెను. దానిని చదువుకొనుచు చక్రవర్తి యెడనెడ కన్నీరును తుడుచు కొనుచుండెను.

"శ్రీవారు దుఃఖింప బనిలేదు. పుట్టినది సర్వమును నశించుట ప్రకృతి సిద్ధము. దానికి విజ్ఞులు మనస్తాపమును పొందరు" అని భట్టారకులనెను.

"అందు దేవరకు తెలియని విషయ మేమున్నది? సర్వము తమకు విశదమే! ఇదివరకే యందలి సమస్త విషయములును శ్రీవారికి కరతలామలకములు" అని సుమంతులవారనెను.

"అందలి యొక్క విషయమునకు మహారాజ్ఞితోపాటు మేమందరమును విచారించితిమి. పౌత్రముఖ దర్శనము చేయకుండ మహారాజ్ఞి గతించెనని మాత్రము మాకందరకు కూడ మనశ్శల్యముగా నున్నది." అని సుమంతులవారు వివరించిరి.

"అమ్మగారు నాతో నెన్నడును నాప్రశంస చేయలేదు. చేసిన యెడల వారి కోరికను తీర్పకుందునా?" అని చక్రవర్తి సవినయముగా ననెను.

"ఇప్పటికిని మించిపోయి నది లేదు. అమ్మగారి కోరికను తీర్చుటకు తామంగీకరించిన యెడల సంతోష పూర్వముగా మేము యత్నింతుము" అని భట్టారకులు నుడివిరి. చక్రవర్తి ముఖమున నదివరకున్న విచారమునకు మారుగ మందహాస మంకురించెను. అది మంత్రులకు ప్రోత్సాహక మయ్యెను.

"ఖారవేలపుత్రి త్రిలోకసుందరి యని విందుము. అయి నను ప్రత్యక్షముగా చూడనిది మనమేమియు చెప్పజాలము. సుమంతులవారూ! మనశివనాగ భట్టాచార్యులవారు వారణాసికి తీర్థయాత్రకు వెడలుదురని వింటిమిగదా?" అని రుద్రభట్టారకు లనగా, "శ్రీవారి యాజ్ఞయైన, భట్టాచార్యులవారు జగన్నా థక్షేత్రమును దర్శింప వెళ్లినప్పుడు సమయముచూచి యా సుందరిని చూచి రమ్మని చెప్పుదును" అని సుమంతులవారు పల్కెను. అందరి నయనములును చక్రవర్తి ముఖముపై బడెను. చక్రవర్తియు చిరునగవుతో మౌనము వహించెను. మౌన మర్ధాంగీకారమని మంత్రివరులు నిశ్చయించుకొనిరి. అంతటి తో నాసభ ముగిసెను. శివనాగ భట్టాచార్యులతోపాటు చిత్రకారుడగు ఇందుశ్రీ కూడ వెడలెనని యనుకొనిరి. చక్రవర్తి వివాహమునకు బీజావాపమయ్యెను.

## 4 అధ్యాయము.

దంతపురము కళింగదేశ రాజధాని. దానికి కాంచన పురమనియు నామాంతరము కలదు. మన కథనాటికి కళింగ రాజ్యమును ఖారవేలు డేలుచుండెను. ఈయన విజేతయని కీర్తి గడించినవాడు. కళింగమునకు తూర్పున సముద్రమును, ను త్త

రమున మగధరాజ్యమును, దక్షిణమున శాతవాహన సామ్రా జ్యమును, పశ్చిమమున చక్రకోట్యమును కలవు. ఖారవేలుని తండ్రి చక్రకోట్యమును జయించి యాదేశపు రాజును తనకు సామంతునిగా చేసుకొని, తన కుమార్తెనా ప్రభువున కిచ్చి సంబంధము కల్పించుకొనెను. దక్షిణమున గోదావరి కళింగ శాతవాహన రాజ్యములకు సరిహద్దు. అందుచే రాజ్యమును దక్షిణమునకు విస్తృతము చేయ వీలులేక పోయెను. తూర్పున సముద్రమగుటచే నిక యుత్తరము మిగిలెను. మగధరాజ్యము మౌర్యవంశమున నిలకడగా నుండలేదు. సుంగ వంశమునకు సంక్రమించెను. తద్వంశీయుడైన పుష్యమిత్రుడు మనకథ నాటికి పాటలీపుత్రము నేలుచుండెను. ఇతనికిని, కుమారుడగు నగ్ని మిత్రునకును గర్భశైత్యము లుండెనని వినికిడి. అందు వలన కళింగమువైపున దక్షిణమున నున్న కొన్ని భాగములు బలహీనములై యుండుటచే, ఖారవేలుడీ యుత్తర భాగము లను కొన్నిటిని సులభముగా నాక్రమించుకొనెను. కాని యచ్చట అప్పుడప్పుడు నల్లరులు జరుగుచురాగా, నతనికి తరుచావైపునకు పోవుట యవసర మగుచుండెను. దంతపురము గోదావరీ మహానదులకు మధ్యకలదు. లోతైన యగడ్తల తోను, బలమగుకోటతోను, విజేతయగుఖారవేలునిచేతశిక్షితమైన సుభట సమూహముతోను దుర్భేద్యముగనే యుండెను. మరియు రాజధాని యుభయనదీ మధ్యమునను న్నదిగాన దాని కెట్టి శత్రుభయమునులేదు. ఉత్తరమునకు తరుచు వెడలవలసి వచ్చుచున్న ఖారవేలునకు తనరాజధానికి ప్రమాదములేకపోవుట సహకారియయ్యెను. గోదావరీ తీరమున సీమరక్షక

దళములు మెండుగా నుండెను. ఏదియెట్లున్నను దక్షిణ విజయ కాంక్షఖారవేలునిలో చావలేదు. చక్రకోట్యరాజ్య మధ్యము నుండి గోదావరి ప్రవహించుటచే యావంక గోదావరిని దాటుట కాటంకములేదు. కానియుత్తరమును గట్టిచేసుకొనిన గాని పశ్చిమ దక్షిణములకు దృష్టి మరల్చ కూడదనియు కొంత కాలము వేచియుండుట మంచిదనియు తలచి యెట్టి దండయాత్రను తలపెట్ట లేదు.

ఖారవేలునిది జైనమతము. అయినను అందున్మాదము లేదు. విజేత యగుటచేత మత సహనము మంచిదని మాత్రము నమ్మి యుండెను. ఈయనకు పుత్రసంతానము లేదు. ఒక్క కుమార్తె కలదు. ఆమెకు కుసుమలత యనిపేరుంచిరి. ఆమెను చూచినవారామెకా పేరు సార్థక నామమనియే తలతురు. ఆమె శరీరము లత-ఆమె ముఖము కుసుమము. కుసుమ మందలి రక్తిమయు, మార్దవమును, సౌందర్యమును, నాహ్లాదకత్వ మును, సువాసనయు నూహించుకొనిన, నామె ముఖకమల రామణీయకము మనకు స్ఫురించును. భ్రమరములవలె నల్ల నగు నలకలును, వెడదలై సోగలైయున్న కాటుక కండ్లును, ముఖకమలాస్వాదమునకై వచ్చిన తుమ్మెదలా యన్నట్లుం డెను. మైదీగె స్వచ్ఛస్వర్ణ కాంతితో నలరారు చుండెను. యౌవన మంకురించి, మొగ్గదొడుగుచున్నది. కుట్మలశోభిత మగు మల్లెతీగె నామె పరిహసించునట్లుండెను. తండ్రి యా మె మహాపండితుల రావించి విద్య గరపు చుండెను. ఆమెకు మంచి సాహిత్య శాస్త్రజ్ఞాన మలవడెను. స్వయముగా కవి తాసామర్థ్య ముండెను. దీనికి తోడుగ మంచి లలిత కళాజ్ఞా

నముకూడ కలదు. స్వయముగా చిత్రములను వ్రాయగలదు. వీనికి మకుటముగ వినయవిధేయతల కామె ఖనియై వరలెను. తండ్రి యనుమతిచే నామె విలువిద్యయందును, మిగిలిన యుద్ధ కార్యముల యందును, నశ్వగజ యుద్ధములందును గొప్ప ప్రావీణ్యముసంపాదించెను. కుమార్తెకు తగినవరు నన్వేషించు కాంక్షకూడ శాతకర్ణిపైకి దండెత్తకుండుట కొక కారణము. తల్లిదండ్రులకేకైక పుత్రియగుటచే నల్లారు ముద్దుగా పెరిగెను.

ఒకనాడు తల్లిదండ్రులును కుమార్తెయు నంతఃపురమున మాటలాడు కొనుచుండిరి. "నాన్నగారూ! గోదావరీ పుష్కరము వచ్చుచున్నదని వినియున్నాను. పుష్కర కాలమున నదీస్నానము బహుపుణ్యదాయి యని గోదావరీ మాహాత్మ్యమున చదివితిని"

"అమ్మా! మన మతమున నిట్టి నమ్మకములు లేవు. జలముల స్నానమాడిన శుభ్రతయేగాని పుణ్యము లభించునా?"

'పుణ్యమనునది యున్నదా లేదా?'

'ఉన్నది. కానియది నదీజల స్నానఫలిత మగునాయని యనుమానము'

" పుణ్యమనునది యున్నప్పు డొక కార్యము పుణ్యప్రదమనియు, మరియొకటి కాదనియు నెట్లుచెప్పనగును? జీవ కారుణ్యము పుణ్యమందురు కదా?'

'మన శాస్త్రములా విషయము తెల్పుచున్నవి'

'పుణ్యపాపములకు రూపములులేవు కదా? 'వాని మంచి చెడ్డలు మనకెట్లు తెలియును? అట్లే నదీజల స్నానము పుణ్యకార్యము కావచ్చును.'

'తల్లీ ! నేను కాదని గట్టిగా ననజాలను. కాని యిప్పుడా సంగతి యేల?'

'సమస్త మతములును సత్యములేయని తమ రనుచుందురు.'

'అదియే నానమ్మకము. జగన్నాథ క్షేత్రమును పోషించుచుండ లేదా?'

'అట్లే సమస్త మత ధర్మములలో విశ్వాస ముండ వచ్చును కదా?'

'ఉండవచ్చును కాదు- ఉండవలెను. నామనస్సు కూడ క్రమముగా పరివర్తన పొందుచున్న ట్లనుభవించుచున్నాను. ఆకారణముననే జగన్నాథ క్షేత్రమునకు దానశాసన మిచ్చితిని.'

'చిత్త సంస్కారమున కదియే మార్గమని పెద్దలందురు. సంస్కృత చిత్తులగు తమకు నామనవి యొకటి కలదు.'

'ఏమిటది?'

'మొన్ననమ్మగారును నేనును గోదావరీ మాహాత్మ్యమును చదువు చున్నప్పుడు రాబోవు పుష్కర కాలమున స్నానమునకు వెడలవలెనను నిచ్ఛ జనించెను.'

'జనించిన వెడల వలసినదే!'

'మీరుకూడ దయచేసిన మనమందరమును కలిసి వెడలుదము.'

'తల్లీ ! ఉత్తర ప్రాంతములలో కొంచె మరాచకము ప్రబలినట్లు వార్తలు వచ్చినవి. అందుచేత నేను పోవలయును. పోయిన నెప్పటికి వత్తునో చెప్ప జాలను.'

'అట్లైన నమ్మగారును నేనును పోవచ్చునా?'

'కోటిలింగ క్షేత్రమున మన ప్రతినిధి కలడు. ఆయనకు వ్రాతును.'

'గౌతమీ దక్షిణ తీరముననున్న గోప్పద క్షేత్రమును కూడ సేవింపవలెనని యున్నది. అది మనరాజ్యము కాదు గదా!' యని సుమలత యనుచుండగా ప్రతీహారివచ్చి ద్వారముకడ నొక బ్రాహ్మణుడు శిష్యసమేతుడై వేచి యున్నాడని విన్నవించెను. స్త్రీజనము పోవలయునని లేచిన "బ్రాహ్మణులు వంద్యులు, కావున పోవలదు" అని వారించి వారిని ప్రవేశపెట్టుమని ఖారవేలుడుప్రతీహారి కాజ్ఞ యిచ్చెను.

శివనాగ భట్టాచార్యులును, నిందుశ్రీయు రాజు సమక్షమునకు రాగా ఆచార్యులవారి బ్రహ్మతేజంబున కచ్చెరువడి ఖారవేలుడును స్త్రీజనముతో లేచి యాచార్యుల వారికి వందనముగావించి యాసనములలో కూర్చుండ కోరెను.

'తమ యుదంతమును వినగోరుచున్నాము. ఈమె నా కేకైక పుత్రి'యని ఖారవేలుడు సంభాషణము ప్రారంభించెను.

'దీర్ఘాయుష్యమస్తు. శీఘ్రమేవ యుష్మన్మందిరే కల్యాణమస్తు' అని భట్టాచార్యులు దీవించిన పిదప నీ క్రింది సంభాషణము జరిగెను.

'మాది ధాన్యకటకము. నేను శిష్య సహితముగా కాశ్యాది క్షేత్రములను సేవించి, జగన్నాథ క్షేత్రమును సందర్శించి, తమకీర్తిచే నాకృష్టుడనై దర్శనము చేయ వచ్చితిని.'

'శాతకర్ణి మహారాజు సుఖుడేనా ? పాపమాయనకు మాతృవియోగమగుటకై చాల చింతించితిమి.'

'తమ సౌజన్యము కొనియాడ దగినది.'

'మేమిప్పుడే మీ మహారాజును గూర్చి యనుకొను చుంటిమి ? ఇంతలో మీరు దయచేసితిరి. మీమహారాజుకు నూరేండ్ల యాయుష్యము'

'విశేషమేమి ?'

'మాయమ్మాయి గోదావరీ పుష్కరములో కోటిలింగ క్షేత్రమును సేవింపనెంచి, యాదినములలోనే గోష్పద క్షేత్రముమునుకూడ సేవించ నిచ్ఛగించు చున్నది. అది మా రాజ్యము లోనిది కాదని సందేహించు చుంటిమి.'

'కాకపోయిననేమి? తమ యిచ్ఛను తెలిపిన మామహా రాజు యావత్సౌకర్యములను సమకూర్చగలరు. మేమునుపోయి తమ యిచ్ఛను తెలిపెదము.'

'అట్లైన అమ్మాయీ ! ఒక తాళపత్రముం దెమ్ము. శాతకర్ణి మహారాజునకు జాబువ్రాసి పంపుదును.' అనుచు ఖారవేలుడు తాటియాకుపై నొక లేఖవ్రాసి తనముద్రిక వేయించి వారికివ్వదలంచి, మరల నాలోచించి,

'మా దూతను లేఖతోగూడ పంపెదను. మీరీ విషయమై మీ మహారాజుతో చెప్పి మావారికి కావలసిన సమస్త సౌకర్యములను చేయింపుడు.' అనెను. అంత భట్టాచార్యుల వారును,

'తాము దయచేయరా?' యని ప్రశ్నించెను.

'మాకు కార్యాంతరముచే జగన్నాథక్షేత్రి ప్రాంతము నకు పోవలసియున్నది. వచ్చునది స్త్రీజనముగాన మహారాజు గారితోనిదిస్వవిషయముగా దెలపవలయునని నామాటగావిన్న

వింపుడు' అని ఖారవేలు డనెను. భట్టాచార్యులవా రింతసేపు మాటలాడుచున్నను దృష్టిచాలవరకు రాజపుత్రిపైననే ప్రసరించెన. ఇందుశ్రీ మాత్రము, నేత్రముల మూలమున నామె సౌందర్యమును, ఆ కార మును, మనమునన చ్చు పడు నట్లేకాగ్రచిత్తుడై చూచుచుండెను. ఖారవేలుడును నొక సేవకుని రావించి యాతనికా కమ్మనిచ్చి వీరితో ధాన్య కటకమునకు వెళ్ళుమని యాజ్ఞాపించెను. భట్టాచార్యుల వారును, నిందుశ్రీయు నారాత్రియచ్చట రాజున కతిథులుగా నుండి తెల్లవారుజామునలేచి పయనమై పోయిరి. కుసుమలత యు దైవికముగా వారిరాకను గూర్చియు, తన యుద్దేశ్యము ఫలించినందులకును, సంతసించి రాత్రియంతయు నేదో మనం బన్యాయ త్తమై యుండ నిద్రరాక తెల్లవారి మేల్కాంచెను. ఇందుశ్రీయు బసలోనికి పోయిన వెంటనే రాజకుమారి రూప మును తూలికతో చిత్రించి, యామెను బాగుగా చిత్రించితినా లేదాయని సంశయమురాగా భట్టాచార్యుల వారికి తాను చిత్రించిన చిత్రమునుచూపగావారు దానినిచూచి యథాకార ముగా నున్నదని చెప్పగా సంతసించెను. ఆచిత్రమును నలగ కుండ పయనమైనపుడు జాగ్రత్త చేసుకొనెను. దారిలో భట్టాచార్యులవారును. నిందుశ్రీ యు రాజకుమారి తమ చక్ర వర్తి కనురూప గృహిణి కాగలదని నిశ్చయించు కొనిరి.

## అయిదవ అధ్యాయము.

'అమ్మా! నేనుకూడా రావద్దూ పుష్కరానికి?'

'అబ్బాయీ! నిన్ను తీసుక పోకుందునా! తెలివితక్కు

వగా ప్రవర్తించితివా, మన నందరు నవ్వుతారు.'

'మామయ్యా కూతురు నన్ను పెండ్లి చేసుకునే ట్టు చెయ్యవూ?'

'నేను చేసేదేమున్నది? నీతెలివి తేటలనుబట్టి ఉంటుంది ఆ సంగతి.'

'నేను తెలివి తక్కువవాడినా అమ్మా అలాగంటావు?'

'నీ మొగం తెలివి? నీకు 25 ఏండ్లు వచ్చాయి. ఇంత వరకు నీకు తప్పులేకుండా మాట్లాడటమే రాదు.'

'కుసుమలతను చూచి చాలా కాలమైంది. బాగా పెరి గిందిటే అమ్మా!'

'ఇటువంటి ప్రశ్నలే వేస్తావు తెలివి తక్కువగా. కుసు మలత సర్వశాస్త్రాలు చదువుకుంది.'

'అయినా నేను మగవాడిని. నాకు చదువెందుకు ? అమ్మా!'

'అదే తెలివి తక్కువంటే! మగవాడికి కాకపోతే ఆడ దానికా చదువు కావలసింది?'

'చదువు రాకపోయినంత మాత్రాన నేను మేనత్త కొడుకును కాకపోతానా ?''

'మేనత్త కొడుకూ ఒక మొగుడేనా. అని సామెతఉంది.' నీ తెలివి తక్కువ చూచి అందరూ నవ్వుతారు.'

''నేను మామ రాజ్యం చెయ్యలేనూ?''

'హస్తాక్షరాలు బాగా చేయటంరాదు కాని ప్రభుత్వం చేస్తావు!''

'చూడు నా[వ్రా]లు. అది అలావుంచి మరదలును నన్ను కలిసేటట్టు చెయ్యి. అప్పుడు చూపిస్తాను నా తెలివి.'

'ఏమి లేదు. అందరూ నవ్వుతారేమోనని ఆలోచిస్తున్నాను. అయినా దంతపురం పోయి మా అన్నయ్యను యే సంగతి కనుక్కొని అక్కడినించి కలిసే అందరమూ గౌతమ పుష్కరానికి వెళ్లుదా మనుకుంటున్నాను.'

'మరే, మరే, ఇప్పుడు కుసుమలత ఎలా ఉందో చూడాలని ఉందే అమ్మా!'

'అటువంటి మాటలే వద్దనేది. అక్కడికి వెళ్ళి ఇటువంటి మాటలే మాట్లాడుతావు. అంతా నవ్వుతారు.'

'నేను తెలివి తక్కువగా మాట్లాడనుగా! నీ వెలా మాట్లాడమంటే అలాగే మాట్లాడుతానుగా''!

'ఎప్పుడూ నిన్ను యిలా మాట్లాడ మనటానికి నీదగ్గర కనిపెట్టుకొని ఉండమంటావా?'

'పోనీ యిలా మాట్లాడమని ఒక్కమారు చెప్పు. అలాగే మాట్లాడుతాను.'

'మామయ్య యెలా ఉన్నా అత్తయ్య మాత్రం నీవంటే అంత గౌరవం లేనట్టు వింటాను.'

'అత్తయ్యకు కూడా నచ్చేటట్టే మాట్లాడుతాగా!'

'మామయ్యనూ అత్తయ్యనూ అలా ఉంచు. ముందు కుసుమలతతో యెలా మాట్లాడుతావో? '

'ఆ! నాకు తెలియదా యేమి? అయినా చెప్పు యెలా మాట్లాడాలో.'

'చూడటానికి కడుపు నిండేటట్టే ఉన్నావు. నో

తెరిస్తే బయట పడుతుంది బండారం.'

'చూస్తావుగా! నాతెలివి తేటలు. అయితే బయలు దేరడం యెప్పుడు?'

'మాఖశుద్ధ పౌర్ణమి యింకా నెలకుపైగా ఉంది.'

'ఇదే మాసమే అమ్మా?'

'చూచావా అప్పుడె ని తెలివి! ఇది యేమాసమో కూడ తెలియదా యె.'

'దీనికీ మేనమామ కుమార్తెను చేసుకోటాని కేమి సంబంధం ఉంది?'

'నీ మొగం. ఇదే తెలివి తక్కువంటే!''

'నీవు చెప్పు యేమాసమో?'

'పుష్యశుద్ధ పంచమి యివ్వాళ. చెప్పు లెక్కవేసి మాఘశుద్ధ పూర్ణిమ యెన్ని దినాలుంది?"

'పుష్యం తర్వాత మార్గశిరం, ... ...'

'అయింది తెలివి. పుష్యం తర్వాత మార్గశిరమా? చివరకు నెలలుకూడా రావు.'

'పుష్యం తర్వాత యేమిటిమరి. ఆషాఢమా?'

'ఇంకా తెలివి యెక్కువౌతున్నది. పుష్యం తర్వాత మాఘం. ఇవ్వాళ పంచమైతే ఇంకా నెలపదిదినా లుంది.'

'నెలాపదిదినా లంటే యెన్ని? ఇరవైయైదు దినాలా?'

'అదిగో మళ్ళీ అంతే. నెలకెన్ని దినాలు?'

'ముప్పై దినాలు. ఆమాత్రం తెలియదూ?'

'అయితే నెలాపది అంటే యెన్ని?'

'నెలంటే ముప్పది - పదంటే పది. ముప్పదిన్నీ పది ముప్పై ఒకటి, ముప్పై రెండు......నలభై నాలుగు.'

'చదువు అంతవచ్చు! లెక్కలిలావచ్చు. ఇక నిన్నెలా పెండ్లి చేసుకుంటుంది అబ్బాయీ కుసుమలత?'

'మళ్లీ ఆమాటే అంటావు. పెండ్లికీ చదువుకూ ఏం సంబంధం!'

'ఎట్లాగా వుల్లగా ఉన్నావని కుసుమలత భ్రమపడుతుం దనుకుంటున్నావు శాబోలు నీవు?

'నాకంటె చక్కనివాడు దొరుకుతాడూ?'

చక్రికోట్యపురంలో సునీతిదేవికీ కుమారుడు నాగ వాసుకూ ఈవిధముగా సంభాషణ జరుగుచున్నది. ఆనాడేదంత పురమునకు బయలుదేరవలెనని నావెనది యనుకొను చుండిరి. అశ్వశకటములు సిద్ధముగానున్నవి. ఇంతలో దంతపురమునుండి యొక దూతవచ్చి రాణిసాగరానికా దేవి కుమార్తెతోకూడ బయలుదేరినా రనియు, త్రోవలో వివిధస్థలములలో నాగుచు, మజిలీలమీద మాఘశుద్ధ పాడ్యమినాటికి పిష్టపురము చేరుదు రనియు, నానాటి కచ్చటకు రమ్మనిరనియు తెలిపెను. చక్రి కోట్యమునకును పిష్టపురమునకును 20 ఆమడల దూరము. అందువలన నాడే బయలుదేరుట మంచిదని యాదినముననే బయలుదేరిరి. పుష్యబహుళ త్రయోదశినాటికి పిష్టపురము చేరుకొనిరి. పిష్టపుర రాజప్రతినిధి వారికివిడిది నేర్పాటుచేసి విడియించెను. ఇంకను మూడు దినములకుగాని దంతపురమువారు రారు. నాగవాసుకు, కుసుమలత నెప్పుడు చూతునాయని మనస్సు తహతహపడుచుండెను. పాడ్యమి సాయంకాలమున

రాజపరివారమువచ్చుచున్నట్లు వార్తలువచ్చెను. రాజప్రతినిధి యెదురుగాపోయి రాణిగారిని, రాజపుత్రిని, యాహ్వానించి యచ్చటి రాజ భవనమునందు విడియింప నెంచెను. నాగ వాసుకీ సంగతి తెలిసి, "అమ్మా! నేనుకూడా పోతాను వాళ్ల తో" అని తల్లిని బ్రతిమలాడెను. ముందే యెడమ చెయ్యిని చూపునేమోయని యామెకు భయము. అయినను, "పో! జాగ్రత్తగా మాట్లాడుసుమా! తెలివి తక్కువతనం చూపి తివా అంటే మన ఆలోచన అంతా చెడిపోతుంది." అని హె చ్చరించి పంపెను.

గుఱ్ఱము నెక్కి నాగవాసు బయలు వెడ లెను. రాజపరివారము దగ్గరకు వచ్చిన కొలది నాగవాసుకు తహతహ హెచ్చెను. దూరమునుండియే చెలికత్తెలు కుసుమ లతతో నాగవాసుగారు వచ్చుచుండిరని తెల్పిరి. ఆమెయు విసుగుతో చూచుచుండెను. ఇంతలో రాజ పరివారము దగ్గ రకు వచ్చెను. నాగవాసు దృష్టియంతయు 'కుసుమలత యె క్కడనున్నదా? యెప్పుడు చూతునా?' యని యున్నదేకాని తాను స్వారిచేయుచున్న మాటయే మరచిపోయెను. గుఱ్ఱపు కాలునకొక రాయితాకి గుఱ్ఱ మెగిరెను. పైనసున్న నాగ వాసు పేడకడివలె నేలగూలెను. చుట్టునున్న వారందరును దెబ్బయేమైన తగిలెనోయని కాళ్ళను చేతులునులాగి, మెడ యిటునటు సవరించిరి. కాని యతడు పిల్లవాడివలె నేడ్వ నారంభించెను. కుసుమలత చెలికత్తెలు నవ్వ నారంభించిరి. దీనితో నతనికి కోపముకూడవచ్చి, వెనుకకు తిరిగి, "చూడండి మా అమ్మతో చెపుతాను" అనుచు ముఖమింత చేసుకొనెను.

కుసుమలతకు కడుపుబ్బ నవ్వువచ్చెను. "పద్దాపుబావా ! ఇలా రానేవదీస్తాను" అని కుసుమలత హాస్యపూరిత సంభాషణ ము గావించెను. ఇది యంతయు కొంచెము దూరమునుండి చూచుచున్న తల్లి సాగరానికాదేవి యేమియు మాటాడక గంభీరించి యూరకుండెను. నాగవాసు కండ్లనులుపు కొనుచు పరివారముతో కూడ వెనుకగా వచ్చుచుండెను. "గుఱ్ఱమెక్కు బావా! నడవట మెందుకు" అని కుసుమలత పరిహాసముగా ననెను. "నిన్నుచూచి ఎన్నినాళ్లైనదని చూడవచ్చిన పరిహాస మాడుతావా? నీతో నేనుమాట్లాడను. నాకు కోపంవచ్చింది." అని నాగవాసు మూతి ముడుచుకొనెను. సమూహ మంతయు నవ్విరి.

ఈవిధముగా పరివారమంతయు విడిదికిచేరిరి. అచ్చట సునీతి దేవి కుమారుడేమి తెలివితక్కువగా ప్రవర్తించెనో, కార్యము చెడునేమోయని యనుమానించుచునే యుండెను. జరిగిన సంగతి యంతయు విని కుమారుని చీవాట్లు పెట్టెను. నాగవాసు కన్నులను తుడుచుకొనుచు, "అమ్మా! కుసుమలత నన్నుచూచి నవ్వితే నాకు కోపంరాదూ మరి." అని చిన్న బుచ్చుకొని నిలచెను. "అయిందీ యింతేనా? అనుకుం టూనే ఉన్నాను, ఏదో జరుగుతుందని. పోవద్దురా అంటే ఊరుకున్నావూ? నిన్ను ఒంటరిగా పంపితే యింతే" అన్నది. విసుగుతో సునీతిదేవి. నాగవాసు కండ్లనీళ్ళు గ్రుక్కుకొనుచు నిలచియే యుండెను. ఇంతలో కుసుమలత వచ్చి, "అత్తయ్య గారూ! ఎన్ని దినాలైనది చూచి" అని సునీతి దేవికి నమస్క రించి పరామర్శించెను. సునీతి దేవియు మేనగోడలిని కౌగి

లించుకుని, 'ఎంత దానివైనావే తల్లీ!' యని బుగ్గలు పుణికి చెంపలకు మోటికెలు విరిచికొనెను. కుసుమలత నాగవాసును చూచి, "ఏం బావా! అలా చిన్నబోయి నిలుచున్నావు?" అని యడుగగా 'నేను మాట్లాడను. వద్దంటే నన్నెందుకు మళ్ళీ పలకరిస్తావు?' అనుచు, 'చూడవే అమ్మా! నన్ను చూచి నవ్వుతున్నది నీ మేనగోడలు" అని యరచెను. సునీతిదేవి కుమారుని తెలివి తక్కువకు లోలోన విచారించి "ఏమిరా అబ్బాయీ! మరదలు పిలుస్తుంటే యేమిటిరా అలాఅంటావు?' అని మందలించెను. నాగవాసు కోపంగా చూచుచు, "ఏమి టమ్మా! ఇందాకటి నించీ ఒకటే నవ్వు నన్నుచూచి. ఏం నేను బూచివలె కనబడుచున్నానా? నన్నుచూచి నీదాసీలు కూడా పకపక నవ్వటం. అప్పుడు అలానవ్వి యిప్పుడు బావా అంటే నేను పలుకుతానా యేమిటి?" అంటూ మూతి ముడుచు కొనెను. సునీతిదేవి కుసుమలతతో, "ఇక్కడి నించి మళ్ళీ ప్రయాణ మెప్పుడు?" అని యడుగగా, "రేపు విదియ సోమ వారం. మంచిదని రేపే బయలు దేరవలెనని అమ్మగారు అను కుంటున్నారు. మీరు కూడా ప్రయాణమునకు సిద్ధముకండు. కోటిఫలీ క్షేత్రమునుండి సర్వము సిద్ధమైనదనియు రావచ్చు ననియు కబురువచ్చినది. గోష్పద క్షేత్రములో మూడు నాల్గు దినములుండి తరువాత కోటిఫలికి మరల వెళ్ళవచ్చును' అక్కడకూడ మహారాజు సర్వసన్నాహములు చేసియున్నారు" అని కుసుమలత యనెను. అప్పటికే పొద్దుపోవుటచేత నంద రును భోజనములుచేసి ప్రయాణపు బడలికలుదీర పరుండి నిద్ర పోయిరి. సునీతిదేవి మాత్రము తనకుమారుని కోతిచేష్టలకు

విచారించి యతని తెలివి తక్కువ తనమును నిందించి, "నేను కోరుటయేగాని, నిజమాలోచించిన వీడిని కుసుమలతకు కట్టిన యెడల కాకిముక్కుకు దొండపండు కట్టినట్లే యుండును. చాటునైనను నిజమే యనుకొనవలెను. ఏమొగము పెట్టుకొనిమాయన్న నడుగను?" అనుకొనుచుతుదకు కండ్లు మూసెను. తెల్లవారెను. కుసుమలత మాత్రము సుఖముగా నిద్రపోయి తెల్లవారు జాముననే లేచెను. నాగవాసును జాముపొద్దెక్కిన తరువాత లేపవలసి వచ్చెను.

## ఆఱవ అధ్యాయము.

గోష్పద క్షేత్రము కోటిలింగ క్షేత్రమునకు గోదావరీ నది కవ్వలియొడ్డున నున్నది. ఇప్పుడా క్షేత్రమును కొవ్వూరను పేరుతో వాడుచున్నారు. గోదావరీ పుష్కరముల దినములలో నీక్షేత్రమునకు వచ్చు యాత్రికుల సంఖ్య చెప్ప నలవికాదు. గోదావరీనది యిక్కడ గొప్పవేగముతో నడచు చుండును. శాతవాహన సామ్రాజ్య కాలమున నదీతీరమున యాత్రికుల సౌకర్యము కొరకై దాదాపొకమైలు దూరమువరకు మెట్లుకట్టబడియుండెను. పుష్కరకాలమున చక్రవర్తులును వచ్చుట కలదు.

ఆదినము మాఘ శుద్ధపంచమి. గోష్పద క్షేత్రమున సంచలనము హెచ్చయ్యెను. చక్రవర్తి వచ్చునని పట్టణ మంతయు నలంకరించిరి. గోడలకు వెల్లలువేయుట, పందిళ్లు పాకలు మొదలైనవి సమకూర్చుట మొదలైన కార్యము లతిచురుకుగా

జరుగుచుండెను. అచ్చటి ప్రభుత్వ భవనములన్నియు బాగు చేయబడి వలయు యేర్పాట్లన్నియు పూర్తి యయ్యెను. వానిలో నొక భవనము ప్రత్యేకముగా పురుషులకు వేరుగాను, స్త్రీజనమునకు వేరుగాను కావలసిన సమస్త సౌకర్యములతో తయారు చేయబడెను. చక్రవర్తి బ్రహ్మచారి యగుటచే నీభవన మెవ్వరి కొరకు సిద్ధము చేయబడుచున్నదా యని ప్రజలూహలు చేయుచుండిరి. అచ్చటి బ్రాహ్మణుల గృహములలోకూడ వారివారి బంధు జాలములు పుష్కర సమయమునకు వత్తుమని తెలుపుటచే వచ్చినయతిథులకు సమస్త వసతులు కావింపబడెను. రాజ పౌరోహితులు చక్రవర్తి కార్యములకు కావలసిన సంభారములను సేకరించుచుండిరి. నదీతీరమున నున్న సోపాన పంక్తిలో కొంతభాగము రాజ పరివారమునకు ప్రత్యేకించిరి. దానికిని మిగిలిన భాగమునకును మధ్య యవరోధమునుంచిరి. ఆ ప్రదేశము యొక్క వీళ్లను రాజోద్యోగులు, రాజ పురోహితులు ప్రత్యేకముగా పర్యవేక్షించుచుండిరి. ప్రత్యేక భవనమునకు కావలసిన దాసదాసీ జనమునకు జాగ్రత్తగావచ్చిన యతిథుల కేమియులోటులేకుండ సమస్త సౌఖ్యములను సమకూర్చవలెనని చక్రవర్తి యాదేశముల నిచ్చెను. విపణి వీధులన్నియు సమస్త వస్తుశోభితములై ప్రదర్శనమువలె దర్శనీయములై యుండెను. సామ్రాజ్యము నందలి యన్ని మూలలనుండి వస్తుసంచయము తెచ్చి వర్తకులు తమ యంగడులలో నింపిరి. పుష్కర కాలమున నదివరకున్న పట్టణము తాత్కాలిక గృహ నిర్మాణముచే నాల్గింతలు పెరిగెను. పట్టణమంతయు పరిశుభ్రముగ నుంచుటకును, ప్రజ

లందరకును మంచినీటి వసతులకును నేర్పాట్లు జరిగెను. ప్రజా సమూహ మెక్కువగా వచ్చునని సమ్మర్దము లేకుండ వచ్చు వారు వచ్చుటకును, పోవువారు పోవుటకును రహదారీ యే ర్పాట్లు పూర్తి యయ్యెను. అంటువ్యాధులు రాకుండు టకును వచ్చిన చికిత్స చేయుటకును వైద్య బృందము సౌకర్యములను చేసెను. తాత్కాలికముగా నొక వైద్యశాలను స్థాపించిరి. పుష్కర దినము దగ్గరకువచ్చు కొలది సంచలన మెక్కువయయ్యెను. వివిధ ప్రాంతముల నుండియు యాత్రికులు వచ్చుట యారంభ మయ్యెను. గౌతమి యవ్వలి తీరమునుండివచ్చు యాత్రికులకు నిర్బంధములు తీసి వేయబడెను. పడవలపైన నదిదాటి ప్రజలు వచ్చుచుండిరి. మాఘమాసమగుటచే గౌతమీనది జలము స్వచ్ఛమై యెంతా యు పాలవలె రసవంతమై స్నానపాన యోగ్యముగ నుండెను. యాత్రికులకు స్నానమంత్రములను చెప్పి స్నానములు చేయిం చుటకై యచ్చట వైదిక బ్రాహ్మణ శిష్యబృందము వేదను నందలి స్నానమంత్రములను పఠించుచు సిద్ధముగ నుండిరి. నాగ భట్టారకుల శిష్యులు ప్రత్యేక భవనమునకు పురోహితులుగ నియమితులైరి. రేపు పుష్కర దినమనగా చక్రవర్తి సపరి వారముగా దయచేసి తమ రాజభవనమున విడిసిరి. వారా సాయంకాలమున నగరమంతయు పర్యటించి చేసిన సమస్త కార్యములను పర్యవేక్షించిరి. ప్రత్యేక భవనములకు కూడ వెడలి యచ్చటి సన్నాహము లన్నియు పరిశీలించిరి. సేవ కులకును పురోహితులకును వచ్చెడి గౌరవాతిథుల కేమియు కొరత లేకుండ వారి సమస్త సౌఖ్యములకొరకు కప్రమత్తులై

యుండవలెనని యాజ్ఞాపించిరి. దాసదాసీ జనులకుకూడ వచ్చి నదిరాజకుటుంబము వారగుటచే, చక్రవర్తికెట్టి యగౌరవము రాకుండునట్లును, వచ్చినవారు సంపూర్ణముగా తృప్తినొందు నట్లును మెలగవలెనని యాజ్ఞల నొసంగిరి. ఎవరా యీగొప్ప యతిథులని పురజను లందరును నాశ్చర్య పడుచుండిరి. చక్రవర్తి వారికొరకు స్వయముగా నింతటి శ్రద్ధవహించుటకు తప్పక వారు గొప్పవారై యుండవలెను.

క్రమముగా పాదచారులై సమస్త యాత్రలు సేవించి వచ్చిన శివనాగ భట్టాచార్యుల వారును ఇందుశ్రీయు నాదిన మననే ధాన్యకటకము నుండి గోష్పద క్షేత్రమునకు చేరిరి. వారిరాకవిని చక్రవర్తి వారిని సమక్షమునకు పిలచిరి.

"సమస్త యాత్రలు పూర్తియైనవా? దేశము లెట్లున్నవి?" అని చక్రవర్తి భట్టాచార్యులవారిని ప్రశ్నించిరి.

"ఉత్తర దేశమంతయు కల్లోలముగ నున్నది. మగధ సామ్రాజ్యము యొక్క పునాదులగట్టి తగ్గినది. రాజోద్యోగులు స్వతంత్రులై ప్రవర్తించు చున్నారు. పుష్యమిత్ర చక్రవర్తి యాజ్ఞలను వారు పాటించుటలేదు. అచ్చటచ్చట చోర బాధ తలయెత్తు చున్నది. రాజ ప్రతినిధు లాయాప్రాంత ములలో ప్రత్యేక సుంకములను గొనుచున్నారు. పుష్యమిత్రుని పక్షము కొందరును, కుమారుడగు నగ్నిమిత్రుని పక్షము కొందరును నీవిధముగా విభక్తులై యున్నారు." అని భట్టాచార్యుల వారు సమాధాన మిచ్చిరి.

"సాంచిస్తూపము సురక్షితముగనున్నదా?" యని యడిగి నప్పు డిందుశ్రీవైపునకు చక్రవర్తి చూచెను.

'స్తూపమునకేమియు హాని కలుగలేదుగాని ద్వారములు మాత్రము శిథిలము లగుచున్నవి ప్రభూ!'

'ద్వారముల శిల్పము మిక్కిలి సుందర మందురే! నిజమేనా?'

'అత్యద్భుతము, ప్రభూ! విడువ బుద్ధిపుట్టలేదు.'

'నీవు శిల్పివికావున నే యీసంగతి నడిగితిని.'

'మఱియు దక్షిణ ద్వారము బొత్తుగా శిథిలావస్థలో నున్నది. స్థానిక ప్రభుత్వాధికారితో నే నీసంగతి ప్రసంగించితిని. కాని యతడెట్టి శ్రద్ధ వహింపలేదు.'

'ఆ ద్వార శిల్పము ప్రత్యేకముగా మహోన్నత మని వినుదును. నిజమేనా?'

'తమ యూహ సత్యము. తమ యాజ్ఞయైన నేనచ్చటికి పోయి యాద్వారమును మరల చిత్రించి సరిచేతును.'

'ఉన్నది యున్నట్లు పునరుద్ధరించుటకు వీలున్నదా ?'

'అనుమానమే ప్రభూ!'

'మిగిలిన ద్వారముల కుపయోగించిన శిల యచ్చట దొరకునా?'

'వెతికి తీసుకొనివచ్చి చిత్రించవలెను'

'పర రాజ్య ప్రాంతములోనున్న కార్యమును. మన కెట్లు చేయ వీలగును?'

'శిల్పమునకు రాజభేద మేమున్నది ప్రభూ?'

'పునర్నిర్మించుట కెంతకాలము పట్టును?'

'ఆరు మాసములైనను కావలెను.'

'అచ్చట బౌద్ధమతవ్యాపక మెట్లున్నది?'

'దాని కంతయాదరణ మున్నట్లు కన్పట్టలేదు. శిథిలమై యుండుట కదే కారణమని నామనవి.'

'సమయాన. కార్యమును చూచి మన మాపనిచేయుదము. ఈలోపున నట్టిశిల యెచ్చటనైన మన సామ్రాజ్యమున దొరకునో విచారింపుము. అయితే భట్టాచార్యులవారూ? ఖారవేలుడు మిమ్మెను సన్మానించెనా?'

'ఖారవేలుడు చెప్పుకొనదగిన వ్యక్తి. మమ్మత్యంతము గా గౌరవముచేసి తమ మాతృ వియోగమునకు సంతాపమును తెల్పుమని మాతో చెప్పెను.'

'అయిన మనము మైత్రి నెరపదగిన వాడనియేనా మీయుద్దేశము!'

'ఒక్క మైత్రియే కాదు. బాంధవ్య సంబంధము కూడ నెరపదగును. నాగానికా మహారాజ్ఞి యాలోచన వారిజీవితకాలములోనే సఫలము కాలేదని నాకు జిజ్ఞాస కలిగెను.'

'మాకు మీవాక్యములనున్న గూఢార్థము బోధపడక పోలేదు. కాని యావిషయమై వివరింప వలసినదేమైన నున్నదా?'

'ఇందుశ్రీ! ఏదీ చిత్రము?' అని ఇందుశ్రీ నడుగగా నాతడు అవకుంఠనవస్త్రము నూడదీసి స్త్రీ చిత్రమొకటి చక్రవర్తికి సమర్పించెను. చక్రవర్తి తన మనోవృత్తి నితరులు తెలిసికొందురో యని సిగ్గుపడి పరికించి చూడనట్లు నటించెను. గాని చెక్కులందలి రక్తిమయాయన మనస్సును ప్రతిబింబింపజేసెను. ఈవిషయము భట్టాచార్యుల వారును, నిందుశ్రీయు

గమనించక పోలేదు. చక్రవర్తి చిత్రమును మరల నిందు శ్రీచేతి కందిచ్చెను. కాని యాతడు,

'ప్రభూ! దీనిని తమ కొరకై చిత్రించితిని. ఇది తమ సొమ్ము' అని మరల చక్రవర్తి హస్తములలో నుంచెను. చూడ నట్లు చక్రవర్తి మరల చిత్రమును పరికించగా చెక్కిళ్ళు వెను కటికంటె రక్తిమను వహించెను. మనసునందలి రాగమారక్తి మకు జాతీయమని చూపరు లిద్దరును గ్రహింప గలిగిరి.

ఇట్లనుకొను చుండగా సేవకులువచ్చి గౌతమీనదిలో నుండి యొక నౌకాబృందము వచ్చునట్లు విన్నవించిరి. భట్టా చార్యులవారి వెంటవచ్చిన ఖారవేల దూత తెచ్చిన యుత్త రమును భట్టాచార్యులవారు చక్రవర్తికిచ్చిరి. అది చదువుకొని యాతెచ్చిన దూతను సమర్యాదముగా గౌరవింపుడని యాజ్ఞా పించి, వచ్చునది స్త్రీజనమగుటచే స్వకార్యముగ నెంచు కొన వలెనని యా యుత్తరమునందలి వాక్యములను గమనించి తానే స్వయముగా వెడలి వారి నాహ్వానించెను. చిత్ర దర్శన మును, లేఖయందలి వాక్యములు నీ నిశ్చయమునకు కారణము లని వేరె చెప్ప బనిలేదు. చక్రవర్తి మిగిలిన పరివారము నంతను నందేయుంచి, ఇందుశ్రీ భట్టాచార్యులవార లిద్దరితో, వచ్చు రాజబంధువులకు స్వాగత మిచ్చుటకై గౌతమీ తీర మునకు వెడలెను. చక్రవర్తియే స్వయముగా వచ్చునని కుసు మలతయు, తల్లి సాగరానికాదేవియు ననుకొనలేదు. కావున ప్రసాధనాదికమునకు కాలము లేకుండెను. పడవ మీదినుండి రేమ్, మహారాజ లాంఛనములతో, నతిలోక సుందరుడై ద్రష్ట

వ్యక్తైయున్న మహా తేజశ్శాలిని మహారాజుగా నూహించి
సరంగులు పడవ నొడ్డునకు చేర్చు లోపుననే లోపలికి పోయి
యప్పటి కనువైన ట్లలంకరించుకొని కుసుమలత సిద్ధమయ్యెను.
పడవ తీరమునకు వచ్చెను. మహారాజు నౌకమీదికి భట్టా
చార్య సహితముగా పోయి సాగరానికాదేవికిని, తలపంచు
కొని యున్న కుసుమలతకును స్వాగతము నొసగి వారిని విడిది
చేరుటకు రమ్మని యాహ్వానించెను. చూచినవారు కుసుమలత
నేత్రములును మహారాజు దృష్టులును నొక్క త్రుటికాల
మేకమై యుభయులలోను ననిర్వచనీయమైన యొక మార్పును
కలుగజేసినవని గ్రహించలేరు. భట్టాచార్యులవారీ రహ
స్యమును కనుగొనిరి. మహారాజు చేతనున్న సువర్ణ వేత్రము
తన తట తాన క్రిందకు పడిపోయెను. కుసుమలత యుత్తరీ
యాంచలము గౌతమీ జలములపైనుండి వచ్చు పైరగాలికి
కొంచెము తొలగినను నామె యథాప్రకారముగా సవరించు
కొనుటను మరచెను. చిత్తజుని చెయిదము లనూహ్యములు!
కుసుమలత తల్లి మహారాజుకు మాతృశ్రీ చనిపోయి నందులకు
సానుభూతిని తెల్పి కుమార్తె వెంటరా నౌకదిగెను. తీరమున
నున్న యశ్వశకటముల నధిరోహించి సపరివారముగా విడిదికి
చేరిరి. మొదటి శకటములో మహారాజును, సాగరానికా
కుసుమలతలును నాసీనులైరి. శకటము నడచుచున్నంతసేపును
మహారాజు నేత్రములును కుసుమలత దృక్కులును నొండొ
రులు కలుసుకొన వలెనని యత్నించుటయు, కలిసినపు డెడ
బాయుటయు జరిగెను. ఉభయులలో చిత్తవికార మంకురించి
ట్లు వేర చెప్ప నవసరములేదు. ఉభయులును నారక్త కపో

లులై విశ్వమును మరచి, యప్పుడే యాగవలసి వచ్చెనని విచారించుచు శకటావరోహణము గావించి, తప్పని సరిగా విడిపోయిరి. పోవుచు మహారాజు పరిచారకులనప్రమత్తులై యుండుడని యాజ్ఞాపించి కాళ్లు రాకరాక వెడలి పోయెను. సాగరానికయు వారిముఖముల వలన చిత్తవృత్తుల నూహించి గంభీరించి యూరకుండెను.

ఆరాత్రి వారిరువురును పర్యంకములమీద దొర్లుటయే గాని కంటినిండ నిదుర పోలేదు. పాపము! నాగవాసును గూర్చి తలచుకొనిన వారులేరు. కుసుమలత కతడున్నట్లే జ్ఞాపకములేదు. సునీతిదేవియు తనకుమారునకు కుసుమలత లభించ దని నిశ్చయించుకొని చూచుచు మౌనము వహించెను. కాని మనమున నోర్వలేమి లేకపోలేదు. అయినను అన్న గారితో తుది యత్నము చేయవలెనని మాత్రము నిశ్చయించు కొని యూరకుండెను. వెంటవచ్చిన ఇందుశ్రీ భట్టాచార్యుల వార్లు జరిగినదానికి సంతసించి యంకురించిన ప్రేమబీజ మభి వృద్ధినొంది పుష్పించి ఫలించవలెనని కోరుకొను చుండిరి. సంగతులన్నియు వీరివలన తెలిసికొనిన రుద్రభట్టారకులును సుమంతుల వారును మనంబుల నానందము నొందిరి. నాగవాసు కారాత్రి నిద్రపట్టలేదు. అర్ధరాత్రిమునలేచి తల్లివద్దకుపోయి తనస్థితిగతులను మొరవెట్టుకొనెను.

'అమ్మా! ఈ శాతకర్ణి నాప్రాణాని కెక్కడ దాపరించాడు?'

'నీ వప్రయోజకుడివి కావటంచేతనే యిలా తటస్థించింది. నీవుత్త అంబేదవు.'

'కుసుమలత నావంకే చూడదు. నీవుకూడా నన్నే తిడ తావు. ఇకనాకు గతేమిటి ?'

'ఆ సంగతి కుసుమలతను పోయి అడుగు'

'అమ్మా! నన్ను కోపపడుతుందిగాని, నీవడిగి కనుక్కో'

'బాగుంది. పెండ్లి నీకా నాకా?'

'నాకు పెండ్లి కావటం నీకిష్టంలేదుటే అమ్మా?'

'ఇష్టమే! కాని బలవంతం చేయమన్నావా?'

'నాకు కోపంవచ్చిందా అంటే చూడు యేంచేస్తానో?'

'చాలా చేస్తావు. చేసిచేసి యింతవరకు తెచ్చుకొన్నావు. మన బంగారం మంచిదైతే కంసాలివాడిని దూషించట మెందుకు?'

'అయితే నీవు కనుక్కోవా? చూడు!'

'పరాయిదేశం యిది. అల్లరిమాత్రం చేయబోకు నాయనా! అప్రతిష్ఠ కూడాను !'

ఇక నేమియు చేయలేక నాగవాసు వెళ్లిపోయెను. ఆతడు మూర్ఖుడు, ఏమిచేయునో యని సునీతిదేవి యాందుర్దా పడుచుండెను. ఇందరి కిన్ని విధముల కష్టములు కలిగించుచు రాత్రి గడచెను. తెల్లవారిన పుష్కర దిన ప్రారంభము.

## ఏడవ అధ్యాయము.

ఆదినము మాఘశుద్ధ పూర్ణిమ. పుష్కర పుణ్యకాలము. ఆదినమున గౌతమీ స్నానమునకు వచ్చినవారి సంఖ్య యింత యని చెప్ప నలవికాదు. మహారాజు సపరివారముగా పోయి

వసునాగ భట్టాచార్యులవారు స్నాన మంత్రములు చెప్పగా నఘమర్షణ స్నానమాచరించి పితృతర్పణముచేసి గౌతమీ తీర మున సమస్త దానముల నాచరించి, బ్రాహ్మణులకు దక్షిణా దికములిచ్చి మరల రాజభవనమును చేరెను. తరువాత స్త్రీ జనము స్నానములకు వెడలి, స్నానమాచరించి గౌరిపూజచేసి ముత్తైదువులను పూజించి బసకుచేరిరి. నాగవాసు కింకను కోపము సమసిపోక యందరితో కలిసిపోక యొంటరిగా స్నానము నకుపోయెను. నీటిలోదిగి స్నానము చేయుచుండగా కాలు జారి నదిలో నొరిగెను. ఈత రాకపోవుటచే మునుగుచు తేలుచు నీరు త్రాగుచుండగా నొడ్డున నున్నవారుచూచి నీటి లో దుమికి జుట్టుపట్టుకొని తీరమునుచేర్చిరి. నీరెక్కువగ త్రాగ లేదుగాన త్వరలోనే తేరి క్షేమముగా నింటికి చేరెను. సునీతి దేవియు జరిగిన సంగతి యంతయు విని, ఏకైకపుత్రుని బ్రతి కించి నందులకు ముక్కోటి దేవతలకును మ్రొక్కి సంతోష సూచకముగా బ్రాహ్మణపూజ చేసెను. కుసుమలత కీ సంగతి తెలిసి,

'బావా! గౌతమీనది యెంత లోతున్నదో చూచినా వటగా! ఎంత లోతున్నది?' అని పరిహసించెను. 'చూడవే అమ్మా! నీ మేనగోడలు నన్ను పరిహాసం చేస్తున్నది.' అని తల్లితో చెప్పుకొనెను. ఆమెయు, 'ఒక చెంప వాడు చచ్చి బ్రతికితే యేమమ్మా యిలా పరిహాసం చేస్తున్నావు?' అని కుసుమలతను మందలించెను. సాగరానికయు, 'ఇదేనాతల్లీ ! పరిహాసమునకు కాలము?' అని కుమార్తెను కోపపడెను. కుసుమలతను వారు కోపపడినందులకు నాగవాసు సంతసించెను.

ఈవిధముగా వారిద్దరి హృదయములు దూరములై పోవుచుం డెను. ఇట్లా దినమంతయు గడచెను.

చక్రవర్తి కాదినము తీరిక లేకపోయెను. ఆయన దర్శనమునకు వచ్చువారి సంఖ్యకు మితిలేక పోయెను. కాని హృదయము కుసుమలత నెప్పుడుచూతునాయనియువ్విళ్లూరు చుండెను. కుసుమలతయు కాళ్ళశబ్దమైనపు డెల్ల శాతకర్ణి వచ్చుచున్నాడేమో యని తలచుచుండెను. మరునాడు శాత కర్ణి ఓరిబసకువచ్చి వారిని రాజభవనమును చూచి పొమ్మని యాహ్వానించెను. సాగరానికాదేవియు నందుల కియ్యకొని చక్రవర్తి యంపిన శకటములనెక్కి కుమార్తెతోను, నాడు బిడ్డతోను వెడలెను. చక్రవర్తియు వారి నాహ్వానించి భవన మంతయు చూపుచుండెను. ఇట్లు చూచుచు వారందరును చక్రవర్తి శయనా గారములోనికి వెళ్లిరి. చక్రవర్తి పండు కొను శయ్య కెదురుగానున్న కుసుమలత చిత్రమును చూచి సాగరానికయు కుమార్తెయు నాశ్చర్యము నొందిరి. 'ఎట్లా వచ్చెనా యిట్టి చిత్రము!' అని కుసుమలత తర్కించుకొను చుం డగా చక్రవర్తి దృష్టియంతరముగా నామెపైనను చిత్రముపై నను పడెను. ఇందుశ్రీ నైపుణ్యమున కాయన మెచ్చుకొనెను. కుసుమలతయు తలవాంచి క్రీగంట శాతకర్ణిని కనుగొనెను. ఆకటాక్ష విక్షేపము నందలి తీక్ష్ణత రాజు హృదయములో సూటిగనాటి యాయనను విహ్వాలునిగ నొనర్చెను. కుసుమలత యు నటు వెడలి పోవుటకును, నుండి పోవుటకును కాలాడక స్తంభించి పోయెను. సాగరానిక, "అమ్మాయీ! ఇకరా

పోదము" అని యనినప్పు డులికిపడి పోవలసి వచ్చెనే యని యున్నను చేయునదిలేక తల్లిని వెంబడించెను. ఇట్లు వారంద రును భవనమును, దానిచుట్టునున్న యుద్యానవనమును చూచి వెడలు చుండగా చక్రవర్తి యాదలి క్రీడా సరస్సునుండి యొక కమలమునుతుంచి యెవ్వరును చూడకుండ సమయము కని పెట్టి కుసుమలత చేతికందిచ్చెను. ఆమెయు తానేమి చేయు చున్నదియు తెలియకయే దాని నందుకొనెను. హస్తద్వయ మునకు కమలము మధ్యవర్తి యయ్యెను. కుసుమమునం దిచ్చుట మూలమున కుసుమాయుధు డుభయులను లోబరచు కొనెను. కాని భవిష్యత్తు నెవరు నిర్ణయించ గలరు?

పుష్కర దినములు నాల్గు గడచెను. ఇక కళింగరాజ భార్యాపుత్రికలు పోవలసిన దినము వచ్చెను. కుసుమలతా శాతకర్ణుల కిది పరీక్షా సమయము. ప్రయాణమునకు సర్వము సిద్ధమయ్యెను. శాతకర్ణి స్వయముగావచ్చి వారిని సాగనంప నెంచెను. వారందరును నదీతీరముననసిద్ధముగానున్న నౌకలవద్దకు వచ్చిరి. ఎక్కలేక యెక్కలేక కుసుమలత పడవపై నెక్కెను. ఇక లంగరెత్తు కాలమున నుభయులహృదయముల యందును మన్మథుడు లంగరును నాటెను. ఖారవేలునకు తమ నమ స్కారములను తెలుపుమని చక్రవర్తి సాగరానికా దేవితో విన్నవించెను. ఆమెయు నాయనకు తమవందనములనర్పించెను. అటు పడవపైన కుసుమలతయు, నిటుతీరమున శాతకర్ణియు నొండొరులు కనపడునంత వరకు తమ దృష్టుల నొండొరుల పై ప్రసరింప జేసికొనిరి. శాతకర్ణి ఇందుశ్రీకి పరివారమును

కోటిలింగ క్షేత్రమున దించిరమ్మని యాజ్ఞాపించెను. అందరును కోటిలింగ క్షేత్రమును చేరి పడవలనుదిగి వారి ఒసకు వెడలిరి. ఇందుశ్రీని యారాత్రి యుండిపొమ్మని సాగరానికా దేవి కోరెను. అవకాశమును చూచుకొని చక్రవర్తి యాజ్ఞతో తెచ్చిన చక్రవర్తి చిత్రమును కుసుమలత కివ్వగా నామె యె వ్వరైన చూతురో యనుకొనుచు పరుగెత్తుకొని పోయి దానిని భద్రముగా తన రహస్య పేటికలోదాచి, తిరిగివచ్చి ఇందుశ్రీ తో చక్రవర్తికి తమ కృతజ్ఞతను తెల్పుమని సందేశ మంపెను. ఇందుశ్రీయు నారాత్రి యచ్చటనుండి మరునాడు గోష్పద క్షేత్రమునకు మరలివచ్చి కుసుమలత సందేశమును చక్రవర్తికి సమర్పించెను. ఈసంగతులన్నియు సుమంతుల వారును భట్టా చార్యులును విని మిక్కిలి యానందించిరి.

పుష్కర దినములైపోయినవి. మరల గోష్పదక్షేత్ర ము తన పూర్వస్వరూపమును దాల్చెను. చక్రవర్తి సపరివా రుడై ధాన్యకటకమును చేరెను. రాజకార్యములలో నిమగ్ను డైనను, కుసుమలత సుందరాకార మాయన మనములో స్థావర మేర్పరచు కొనెను. పుష్కరమునకై వివిధ సామ్రాజ్యప్రాంత ములనుండివచ్చిన వారెల్లరును వారివారి నివాసములకు జనిరి. ఎచ్చటను నలజడిలేదు. రాజ కార్యములన్నియు సలక్షణము గానే జరుగుచుండెను. పైఠణ్‌లో రాజప్రతినిధిగా నియమింప బడిన స్వర్ణశాతకర్ణి యావంకసీమలన్నియు సురక్షితములుగానే యున్నవని విన్నవించుచు దూత నంపెను. ముషిక నగరము నందున్న రాజప్రతినిధి కుంతలుడు సర్వము శాంతముగానేయు న్నదని విన్నవించుకొనెను. సామ్రాజ్యమున కెచ్చటినుండియు

ప్రమాదము లేదు. సామ్రాజ్య మంతయు సుభిక్షముగా నుండెను. ప్రజలు శాతకర్ణిని కొనియాడుకొనుచు సుఖులై కాలముగడపు చుండిరి.

ఖారవేల రాజకుటుంబము త్రోవలో కోటిఫలి, పిష్ట పురము మొదలైన స్థలములను సందర్శించు కొనుచు దంత పురమును చేరుకొనిరి. ఇంకను ఖారవేలు డుత్తరదిశ యాత్ర నుండి తిరిగిరాలేదు. ఇంకను కొన్నిదినములు పట్టుననియు నెండకాల మగుటచే యచ్చటి శత్రువులుపూర్తిగా నిరాస్తులు కాలేదనియు పనియైనవెంటనే వత్తుననియు ఖారవేలుడుదంత పురమునకు వార్తల నంపెను. ఇట్లు వర్షారంభము వరకు గడ చెను. అప్పటికి ఖారవేలుడు మూకల నుత్తర సరిహద్దున కవ్వల నున్న పర్వత పంక్తివరకు తరిమి, యచ్చట కొంతసైన్యము నుంచి శ్రావణ మాసారంభమునకు దంతపురము చేరెను. సునీతిదేవియు నింతదూరము వచ్చి యన్నగారిని కలవకుండ వెళ్లుట తగదని యుండిపోయెను. ఖారవేలుని రాకతో పట్ట ణమున సంచలనము ప్రారంభ మయ్యెను. తానును, తన కుటుంబమును లేనికాలమున రాజ్య చక్రమును చక్కగానిర్వ హించినందులకు ఖారవేలుడు మంత్రి దండనాథుల నభినందిం చెను.

ఒకనాడు బంధువులందరును సుఖముగా భోజనముచేసి రాజభవనప్రాంగణమున ముచ్చటలను చెప్పుకొనుటకుకూడిరి. తాము గోష్పద క్షేత్రమునకు వెడలుటయు నచ్చట శాత కర్ణి తమకు చేసిన గౌరవమును సాగరానికాదేవి భర్తకు నివే

దించెను. ఆ చెప్పినంతకాలమును శాతకర్ణి నామధేయోచ్చారణము చేసినప్పుడెల్ల కుసుమలత నేత్రములలో నుత్సాహము కనబడు చుండెను. సునీతిదేవి యిదియంతయు వినుచు మాట లాడలేదు. నాగవాసును తలచిన వారు లేరు. దంతపురము చేరిన తరువాత నాగవాసు కుసుమలత తనకు చూపుచున్న నిరాదరణచే నిక లాభము లేదని నిశ్చయించుకొని కొందరితో స్నేహము చేసుకొని వారితో వినోదించుచుండెను. సునీతిదేవియు సమయమునకై వేచియుండి సాక్షాద్వివాహ ప్రశంస వచ్చినపుడు తాను సమిధలు వేయవచ్చునని కాలమునకై వేచి యుండెను. కుసుమలతయు నేకాంతము లభించినపుడెల్ల శాతకర్ణి చిత్రమును చూచి యానందించుచు తనరహస్యము నితరు లెరుగకుండ కాపాడుకొను చుండెను.

'శాతకర్ణి విషయమై యతని యాకారరూప విలాసములను నాకు కొంచెము చెప్పుము' అని యొకనాడు భార్యను ఖారవేలుడు ప్రశ్నించెను.

'ఆతడు దివ్యసుందర విగ్రహుడు. ప్రజలాయనపైనను రక్తులై యున్నారు. మంచి రాజనీతి నిపుణుడనియే నాయభిప్రాయము. పండితుడు, మిక్కిలి సహృదయుడు. ఆతనియందు సుగుణములన్నియు పుంజీభూతములై యున్నవి. మన అమ్మాయి కన్నివిధముల తగిన వరుడని వేరెచెప్ప బనిలేదు' అని సాగరానిక యనుచుండ సునీతిదేవి యేతెంచి,

'ఏమిటో వివాహ విషయమై మాట్లాడుచున్నట్లున్నది. కుసుమలత వివాహమేనా?'

'అట్టి సంభాషణ మింక నారంభము కాలేదు. శాంత
కర్ణినిగూర్చి మీవదినె నడిగితిని. ఆమె చెప్పుచున్నది.' అని
ఖారవేలుడనెను.

'అన్నయ్యా! ఎంత కాలమునుండియో వేచియున్నాను!
నీకు నొక కుమార్తె. నాకును నొకడే కుమారుడు. మేనరిక
మును మించుట ధర్మముకాదు. నేనింత కాలమును నీరాకకై
వేచియుండుట యందులకే! కావున నీవిషయమై నాకేదో
యొకమాటను గట్టిగాచెప్పిన నావ్యాశంసను మానుదును.' అని
సునీతి యొడమచేయి బయటపెట్టెను. ఖారవేలుడు విని తన
భార్యవంక చూచెను.

'నాదేమియున్నది? మీరన్నలు - ఆమె చెల్లెలు. అన్ని
యు తగియే యున్నవి. 'కన్యా వరయతేరూపం, మాతా
విత్తం, పితాశ్రుతం, బాంధవాః కులమిచ్ఛంతి' అని కదా పెద్ద
లందురు. కావున నందరికిని నిష్టమైన నాకును సమ్మతమే' అని
సాగరానికాదేవి యనెను.

'ఇన్నిమాసములనుండి కలిసి యున్నారుకదా మేనత్త
మేనమామబిడ్డలు! వారి పరస్పరాభిప్రాయము లెట్లున్నవో
నేను వినగోరుచున్నాను' అని ఖారవేలుడనెను.

'ఈవిషయమున నమ్మాయినికూడ కనుగొనుట యావ
సరము. మొదట కన్య యభిప్రాయముకదా ముఖ్యమైనది!'
అని సాగరానిక చెప్పెను. ఖారవేలుడది నిజమని గ్రహించి
వెంటనే యేకాంతమున కుమార్తెతో మాటలాడ వలెనని
యెంచి యామెగదిలోని కకస్మాత్తుగా వెళ్లెను. ఆమెయు

పెట్టెలోనుంచి తీసిన శాతకర్ణి చిత్రమును చూచుచు మైమరచి తలుపునోరవాకిలిగా వేసినందున తండ్రి రాక నెరుగక తదేక ధ్యానముతో నాపటమువంక చూచుచుండెను. ఖారవేలుడు వెనుకనుంచి యామె చేతిలోనున్న యాచిత్రమును చూచి,

'అమ్మా! ఎవరిదా చిత్రము? ఇటు తెమ్మా! నేనును చూచెదను' అనగా కుసుమలతయు తన రహస్యము బయట పడినందులకు సిగ్గుపడి యాచిత్రమును తండ్రిచేతుల కిచ్చెను. ఆయనయు దానిన్నట్లే పరికించిచూచి యందలి ప్రశాంత ముఖవర్చస్సును, నీలములై గంభీరములై తేజఃపుంజములై యలరారు నేత్రములను, చూచి యా సౌందర్యమున కాశ్చర్యము నొంది, యాచిత్రమును శాతకర్ణిదని నిర్ణయించుకొని, తన కుమార్తె ప్రేమ యస్థానపతితము కాదని మనసున నమ్మి, మరల దాని నామెచేతి కందిచ్చెను. ఆమెయు శిరము వాంచి మౌనముతోనుండి తన యవినయమునకు తండ్రి కోపగించు నేమోయని యనుమానించు చుండెను. కుమార్తె మౌనమున ర్థమును గ్రహించి ఖారవేలుడును,

'తల్లీ! నీయభిప్రాయ మవగతమైనది. ఇతర విషయముల నాకెట్టి సంకోచమును లేదు. కాని యతడు నాకల్లు డగుటకును నీకు భర్తయగుటకును తగిన శౌర్యపటిమ యున్నవాయని మాత్రము పరీక్షించినగాని నిశ్చయించుటకు వీలు లేదు. నీవు సమ్మతించిన నాపరీక్షను నీకేవదలెదను.' అని కుమార్తెతో చెప్పి వెడలి పోయెను. ఇంతలో సరస్సున నీదు లాడుచున్న నాగవాసు తల్లి. లువగా నింటికి వచ్చెను. తల్లి యతనిని చూచి,

'మామయ్య నీతో మాటలాడ వలెనని కనిపెట్టుకొని యున్నాడు. బొత్తుగా నాటల మరిగి యిల్లు పట్టకుండనున్నావు?' అని కుమారుని మందలించెను.

'అబ్బాయీ! ఇలా రా!' అని ఖారవేలుడు నాగవాసును పిలువగా,

'నేను రాను. కుసుమలత నన్నవమానించినది.' అని నాగవాసు మొగము చిన్నబుచ్చుకొని యనెను.

'ఎప్పు డవమానించెను? ఏల?' యని మామ యడుగగా, 'ఎప్పుడేమిటి? నన్ను చూచినప్పుడల్లా నవ్వటమూ, చిలిపిమాటలనటమూను' అని కొండెము చెప్పెను.

'మీరిద్దరును మేనత్త మేనమామ బిడ్డలు. చనువు చేత హాస్యమాడిన నంత కోపమేల? ఈమాత్రమున కేనా కోపము?' అని తల్లి యనగా, 'నీవెప్పుడింతే! కుసుమలత పక్షముననే వాదిస్తావు' అని నాగవాసు పసిపిల్లవానివలె మూతిముడుచుకొనెను. ఇంకను యెక్కువగా మాటలాడిన నింకను చులకనగునని సునీతిదేవియు నంతటితో నాప్రసంగము కట్టిపెట్టెను. సాగరానికయు తన మనస్సున నున్న విషయ మప్పుడు చెప్పక తరువాత నేకాంతముగనున్న సమయమున భర్తతో తన మనః మున నున్నదానిని వెలిబుచ్చెను. ఖారవేలుడును వీటియన్నిటి వలన తన మేనల్లుడు తెలివి తక్కువ వాడనియు, కుమార్తెకు తగిన వరుడు కాడనియు, తానింత శ్రమపడి సంపాదించిన రాజ్యమునకు తన తరువాత పాలింపవలసిన యోగ్యత యతనికి లేదనియు, నిశ్చయించుకొని యొకనాడు చెల్లెలితో నాసంగతి స్పష్టముగా తెలిపెను. ఆమె కంత కోపమువచ్చి కుమారుని

దీసికొని చక్రికోట్యమునకు వెడలెను. కుసుమలతయు శాతకర్ణి శౌర్య పరాక్రమముల నెట్లు పరీక్షింతువాయని, సంశయ మొకవైపునను, తన మనోరథము భగ్నమగు నేమో యని భయము మరియొక వైపునను, బాధించుచుండ గానసాగము నందుచుండెను. సాగరానికయు కుమార్తె మనసును గుర్తించి యామెకు ధైర్యము గొల్పుచుండెను. ఖారవేలుని మనమున నేమున్నదో మనకు తెలియదు. కాని మంత్రులను దండనాధు లను బిలచి యేదోపన్నగడ వేయుచున్నట్లు కనపడెను. దండ యాత్రా సన్నాహములు చురుకుగా సాగుచున్నట్లు సంచల నము వలన తెలియు చుండెను. ఎక్కడికో యెవ్వరికిని తెలి యదయ్యె. ఎక్కడికై యుండునని యొకనాడు కుసుమలత యూహించుచు నిట్లనుకొనెను.

'ఎక్కడికై యుండును? శాతకర్ణి పైకిగా యుండునా? ఆయన శౌర్యపరాక్రమములను పరీక్షించుటకు దండయాత్ర యేల? నాన్నగారి యూహ దుర్గ్రాహ్యముగా నున్నది. అయి నను రహస్యముగా దండనాధుని బిలిచి యడుగుదును. నాన్న గారు చేయదలచిన పరీక్ష నేనే చేయుదును.'

## ఎనిమిదవ అధ్యాయము

ఆంధ్రదేశము గోదావరీ కృష్ణా తుంగభద్రా నదీజల సిక్తము. ఈపవిత్ర నదులు పశ్చిమమునుండి తూర్పునకు ప్రవ హించుచు ప్రక్కలనున్న దేశమును సస్యాఢ్యములుగ చేయు చుండును. వానిలో మధ్యనున్నది కృష్ణానది. అది శరదృతువు. కృష్ణామతల్లి టెంకాయ పాలవంటి జలములలో, సైకత శ్రోణి

స్తూ, మందగమనముతో ప్రవహించుచుండెను. జీవనది యగు
టచే నడకచే దాటుట సాధ్యముకాదు. ఈ మూడునదులును
నాంధ్ర దేశమునకు పెట్టని కోటలై శత్రువుల
కాంధ్ర దేశముపై దండెత్తుట యసాధ్య మొనర్చు చున్నవి.
అయినను శాలివాహన చక్రవర్తి యీనదుల దాటుటకనువైన
రేవులవద్ద రక్షక భటశతములనుంచి కాపాడు చుండెను. అది
యాశ్వయుజ పూర్ణిమ. చంద్రుడు తన పదియారు కళలతో
ప్రకాశించుచు భూమినంతను రజత పాంసుమయము చేయు
చుండెను. కృష్ణా తరంగముల జిలజిలధ్వని శ్రోత్రపేయము
చేయుచుండెను. ఒడ్డున కొన్ని నావలు కట్టివేయఁబడి యున్నవి.
నావికులు వానిలో నిద్రించుచుండిరి. తెల్లవారుజామయ్యెను.
ఏదో కలకలము వినరాగా వారు లేచి హెచ్చరికతో నుండిరి.
కతిపయ యాశ్విక సమూహము నదియొడ్డును చేరినదని దాటు
యత్నములో నున్నట్లును వారికి తెలిసెను. వారిలో నొకడు తీర
రక్షకాధికారి యొద్దకువెళ్లి యీసంగతి నివేదించెను. ఆయన
యు వెంటనేవచ్చి యాశ్వికులను "మీరెవరు? ఎచ్చటనుండి
యెచ్చటికి కేగుచున్నారు" అని ప్రశ్నించెను. ఆశ్విక దళనాయ
కుడు రక్షకాధికారిని సమీపించి,

"మేము నదిని దాటవలయును. మాకు సౌకర్యమీ
నిండు" అని యడిగెను.

"ముందు నేనడిగిన ప్రశ్నములకు ప్రత్యుత్తరము లిచ్చి
నగాని యేమాట చెప్పుటకును వలనుపడదు." అని యధికారి
సమాధాన మిచ్చెను. ఆశ్వికదళ నాయకుడు మిక్కిలి చిన్న

వయసువాడు. ఇంకను మీసములు రాలేదు. ఈవిషయము మా యధికారి కాశ్చర్యము కలిగించెను తనలో "ఇంత పిన్నవయసున్న నీయాశ్వికనాయకు డెవడో! రూపరేఖావిలాసములాభిజాత్యమును తెలుపుచున్నవి. చిన్నవాడనిగాని దళము బహు సంఖ్యాకము కాదనిగాని నేను ప్రమత్తుడనై యుండరాదు" అని అనుకొనుచు,

'మౌనమేల వహింతురు? మౌన మవమానమునకు కారణమగును' అని హెచ్చరించెను.

'మా యుదంతము చెప్పకున్న నదీతీరమునకు వలసిన యవకాశములను కలిగించరా?' అని యాయువక నాయకుడు ప్రశ్నించెను.

'మీరు మిత్రులో శత్రువులో నిర్ణయించినగాని యిది మిత్రమని తేల్చుటకు వీలులేదు. మీరు మీయుదంతము చెప్పుట కాలస్యము చేసిన మీరు మిత్రులు కారని నిర్ణయించ వలసివచ్చును' అనియా యధికారి స్పష్టముగా తెలిపెను. అంతట నా యువక నాయకుడు,

'మీచక్రవర్తి యెచ్చట నున్నారు?' అని ప్రశ్నించెను.

'మాచక్రవర్తితో మీకు పనియేమి? చెప్పనకొలదియు మీపట్టును మీరు వీడకున్నారు.' అని యధికారి గద్దించి పలికెను. అంతట నాయువక నాయకుడు,

'మాది చక్రకోట్య నగరము. మేము యాత్రికులము. చాలునా మాయుదంతము?' అని యడిగెను.

'ఈచుట్టుపట్ల చేయవలసిన యెట్టి యాత్రయులేదు. మీ మాటలు మరింత యనుమానమునకు తావొసగు చున్నవి.

కావున వెంటనే మీసర్వ విషయములను చెప్పి తీరవలయును' అని ఖండితముగా పలికెను. యువక నాయకుడును నిక చెప్పక తప్పదని యనుకొని,

'మేము జైన మతస్థులము. మేము శ్రమణ బెళగొళకు యాత్రార్థము వెడలుచున్నాము. ఇంకనైన చాలునా?' యని చిరునవ్వు నవ్వుచు ప్రశ్నించెను.

'ఇంకను ననుమానము వీడలేదు. మీరు పోదలచిన మార్గమును తెల్పుదురా?' అని యధికారి యడిగెను.

'మాకీ దేశము నూతనము. మీరే మేము వెళ్లవలసిన త్రోవను మాకు తెల్ప వలయును.' అని యువక నాయకుడు ప్రత్యుత్తర మొసంగెను. అంతట వారిద్దరికిని నిట్లు సంభాషణ జరిగెను.

'ఇంత దూరము త్రోవ తెలియకయే వచ్చితిరా?'

'ఎడనెడ ప్రశ్నించుచు వచ్చుచుంటిమి.'

'అట్లే ముందును ప్రశ్నించుచునే పోవచ్చును.'

'ఉద్యోగీ! మీ చక్రవర్తి యుద్యోగులు మంచివారం దురే! నీవిట్లు మాటలాడు చున్నావేమి?

'ఏమిమాట లాడితిని?'

'బాటసారులకు వలయు సౌకర్యములు చేయుటమీకు ధర్మము కాదా?'

'పరరాష్ట్రీయుగుండ వెడలునపు డనుమానమునకు తా వివ్వకుండుట మీవిధిమాత్రము కాదా?'

'మే మనుమానమున కేమి తావిచ్చితిమి?'

'మీ యుదంతమును చెప్పనైతిరి. ఇంతకంటె యనుమా

నమునకు కారణ మేముండ వలయును?'

'చెప్పితిమిగదా మేము యాత్రికులమని.'

'ఇంకను ననుమానము పూర్తిగా వీడలేదు.'

'దానికి మేమేమి చేయగలము?'

'మీ మాటలనుబట్టి మీరు కాళింగులవలె నగపడు చున్నారు. నిజమును వచింపుడు.'

'చెప్పితిమి మాది చక్రకోట్య పురమని!'

'చక్రకోట్యమున వైదిక మతముకదా ప్రచారమున నున్నది? మీరు జైనుల మంటిరే?'

'చక్రకోట్య రాజ్యమున జైనులుండ కూడదా?'

'ఉండ వచ్చును.'

'అయిన నిక ననుమాన మేదులకు?'

'యాత్రికులైనధనుర్బాణాదుల నెందులకుధరించితిరి?'

'అధికారీ! దూరదేశములో ప్రయాణము చేయునప్పుడు నిస్సహాయముగ ప్రయాణము చేయుట తగునా?'

'ఇది కొంతవరకు సమంజసమే. కాని మీరుపోవు యాత్రకు బాటతెలియకుండ బయలుదేరితిరా?'

'అడుగుచు, తెలిసికొనుచు నిచ్చటికి వచ్చినాము. ముందులోవ నిన్నడిగితిమి.'

'మీయాయుధములన్నిటిని మావశము చేయవలెను. నదీ తరణానంతరము మీవిమీ కిచ్చివేయగలము.'

'అది సరికాదు. వీరుడు నిరాయుధుడుగా నుండరాదు. మీ కెరుగని వీరనీతి యుండునా?'

'మీరు చెప్పునది నిజమే! కాని మొదటనే తగిన

సమాధానముల నిచ్చిన నేనట్లడిగి యుండను.'

'ఉద్యోగీ! దేశమువిూది. దాని నడుమనున్నాము. మా సంఖ్యయూ మీకపకారము చేయునంత పెద్దదికాదు. ఇట్టితరి మీ సంకోచమునకు కారణమేమో మాకు తెలియకున్నది.'

'అట్లయిన ధనుస్సులను బాహువులనుండి దింప రాదు.'

'ఆవిధమైన యాజ్ఞయే వలదు. మాధనుస్సుల మాట యెత్తిన మేమూరుకొన జాలము. ధనుస్సులతో మరణించుట వీరధర్మము. కావున మామాటను గైకొని, మాకు నదీతరణమున సాయపడుము. అధిక సంఖ్యాకులైన మీరు, ధర్మమునకై పోరాడుమమ్ములను చంపిన మీకువచ్చు ప్రయోజనము లేదు.'

'ఈమాటలువిని తీర రక్షకాధికారి యువక నాయకుడు పలికిన మాటలలోని సత్యమును గ్రహించి.'

'అట్లైన మీరు ముందేయే మజిలీలలో నాగుదురో యచ్చటికెల్ల హెచ్చరిక వార్తల నంపవలసి యున్నది' అని యనెను.

'అది మరియు మంచిది. పంపవచ్చును' అని యువక నాయకుడనెను. అప్పుడధికారి నావికుల బిలచి వారిని నదిని దాటవేయ నాజ్ఞ యొసంగెను. వారును నొడ్డున నావలకున్న కట్లనువిప్పిరి. అశ్వికులందరును నావలకు సరిపోయిరి. వారి యశ్వములను నశ్వరక్షకుడు నదిలోకి దోలి దాటించెను. అప్పుడు యువక నాయకు డధికారిని బిలచి,

'చెప్పక పోతిరి. ముందువచ్చు పట్టణమేది?' అని యడిగెను.

'ముషిక నగరము.'

'ఇచ్చటి కెంత దూరము?'

'ఏబది మైళ్లుండును.'

'త్రోవ సరియైనదేనా?'

'ఆ! మంచిదే.'

'ఈలోపుగా నేనదియైన దాటవలయునా?'

'అక్కరలేదు. మీరచ్చటకు చేరునప్పటికి మావార్తా హరుడు మీయుదంతము నచ్చటి రాజప్రతినిధికి విన్నవించ గలడు.'

'అదియుమంచిదే. అచ్చటి రాజప్రతినిధి యెవరు?'

'ఎవరైన మీకెందుకు? మరల ననుమానమునకు తావిచ్చుచున్నారు.'

'తమ్మిమ్మన ముకూడునా?'

'అచ్చట మీకు పూర్తిగా పరీక్ష జరుగగలదు. అందు తీరిననే మీముందు ప్రయాణము జరుగగలదు'

'మేమును పరీక్ష కొరకే పోవుచున్నాము' అనియువక నాయకుడు పైకనుటకు యత్నించి మరలనాగి,

'పరీక్షయనిన మాకెట్టి భయమునులేదు.' అనెను. వారు చూచుచుండగనే యొక యాశ్వికుడు నదినిదాటి బిరబిర పోవుచుండెను. వారును నాశరత్ప్రాంతఃకాలమున పిల్లవాయువులు కొల్వ నావలలో నదిదాటుచు గడచిన సంభాషణము గూర్చి ముచ్చటించు కొనిరి. ఇంతలో నావలు తీరమును చేరెను. యువక నాయకుడును నావికులకు తలకొక దీనారమునిచ్చి పంపివేసెను. ఆబంగారు నాణెములనువారు తీర

రక్షకాధికారి వద్దకు తీసుకొనిపోయి చూపగా నాయననాని పై నున్న యక్షరములను చూచి వీరు కాళింగులని నిశ్చయించుకొనెను. అంతటితో నీతని కనుమానము హెచ్చెను.

'వీ రబద్ధమాడిరి? వీరిది చక్రికోట్యము కాదు. కళింగ దేశము. మన యానుపానులను తెలిసికొనుటకు వచ్చిన వేగులు కారుగదా! ఎట్లైనను మషికనగర రాజ ప్రతినిధికి కబురంపితిని కదా? అయినను కతిపయులైన వీరివలన జరుగున దేమి?' అనుకొనుచు నయిన నెట్లుండునోయని నాణెములు చూచిన తరువాత కలిగిన భావములను తెల్పుటకై మరియొక యాశ్విక వార్తాహరుని తరిమెను. వారును నదిదాటి యవ్వలి యొడ్డున నాదినమున విడిసి భావి కార్యక్రమ మాలోచించుకొనిరి. మరునాడు బయలు వెడలి వారము దినములలో మషికనగర బహిః ప్రదేశమున విడిసిరి. నగరరక్షకాధి కారియు తీర రక్షకాధికారి పంపిన వార్తవలన వీరువచ్చినట్లు తెలుసుకొని తాను దండుతో నాయత్తుడై యుండెను.

## తొమ్మిదవ అధ్యాయము.

ఒకనాడొక వేగువచ్చి చక్రవర్తితో నచ్చటచ్చట చిన్నచిన్న యాశ్వికుల గుంపులు కనబడుచున్నట్లు విన్నవించెను. చక్రవర్తియు నవి యేకమగు వరకును భయమేమి లేదనియు, కానివానిని కనిపెట్టి మాత్రముండుడనియు హెచ్చరించెను. పైఠను పరగణానుంచియు మషికనగర పరగణా నుండియు కూడ నిట్టి వార్తలే యెడనెడ వచ్చుచుండెను. ఒకనా డకస్మాత్తుగా మషికనగరమునకు 50 మైళ్ళ యుత్తర

మునసున్న కృష్ణ వేణీతీరమును దండొకటి చిన్నది దాటెననియు, నది కళింగ దేశమునుండి వచ్చె నని భావింప బడుచున్న దనియు చక్రవర్తికి తెలియ వచ్చెను. వెంటనే కతిప యాశ్వికులతో ప్రయాణమై శాతకర్ణి వారము దినములకు కృష్ణా తీరమును చేరెను. విచా రించగా నాదండంత పెద్దది కాదనియు, నది కళింగమునుండి వచ్చెననియు, మూషిక నగరముపైకి నడచుచున్న దనియు తెలి సికొనెను. వెంటనే యొక యాశ్వికుని బిలిచి వెనకనుంచి సేనవచ్చు చున్నట్లు తెలిపి ముందునుండి ముట్టడికి సిద్ధము కమ్మని కుంతలునితో చెప్పుమని పంపెను. వాడును వాయువే గముతోజని కుంతలుని కాసంగతి విన్నవించెను. కుంతలుడును తగిన సైన్యము నాయత్తముచేసి సిద్ధముగ నుండెను. ఒకరాత్రి కళింగ బలమొక యడవిలోవిడిసి వంటలు చేసుకొని భుజించి, యారాత్రి యచ్చటపరుండి, తెల్లవారుజామున మూషిక నగర మును జడిపించుటకు వెడలవలెనని నిశ్చయించు కొనెను. ఆవంచున నిద్దరు వ్యక్తులిట్లు సంభాషించుకొనుచుండిరి.

'రాజపుత్రీ! ఎంతటి సాహసము?'

'ఇందు సాహసమేమున్నది? ఇది నాస్వార్థము.'

'కాని యిప్పుడు మన మెంత ప్రమాదస్థితిలో నున్నా మో యాలోచింపుడు. మనము దండెత్తి వచ్చితిమని వారపో హాపడవచ్చును. మనమిందులకు వచ్చితిమని చెప్ప వీలులేదు కదా ?'

'చక్రవర్తిని రప్పించుట కదా మనయుద్దేశము?'

'చక్రవర్తి ధాన్యకటకమునుండి బయలుదేరినట్లు మనకు

మన వార్తాహారి వార్తను తెచ్చినాడు.”

‘అదియేకదా మనకు కావలసినది?’

‘ఆ శాతవాహన సైన్యములు ముందు వెనుకల మనలను ముట్టడించిన నేమగును. మనకు తప్పించుకొను వీలగునా?’

‘మనము యుద్ధము కొరకు రాలేదని స్పష్టముగా తెల్పుదము.’

‘మరియెందులకు వచ్చినట్లు? కారణ ముండవలదా?’

‘మన మింతవరకును నెట్టి ముట్టడిని జరుపక పోవుటయు, మనదారిని మనము పోవుచుండుటయు, చాలవా మన యుద్దేశమునకు తార్కాణములు? ముట్టడియే మన యుద్దేశమైన మనమిట్లు కొంత పర్యటనము చేసి యుందుమా?’

‘అట్లు కాకపోయిన కారణమడిగిన మనమేమి చెప్పగలము?’

‘ఆ విషయము నాకు వదలి వేయుము. అడిగిన నేను దండనాథుడననియు, నాతో మాటలాడుమనియు తెల్పుదు.’

‘మీ ధైర్య సాహసములు మమ్ము లజ్జింపజేయుచున్నవి’

‘మా నాన్నగారే నాకీవిషయమున ననుజ్ఞ దయచేసినారు.’

‘నిజముగా చక్రవర్తితో ద్వంద్వయుద్ధమునకు గడంగుదురా! తల్లీ!’

‘ఆయన ధైర్యసాహసములను పరీక్షించుటయే కదా కావలసినది.’

‘ఎట్లైనను నొప్పింపక తప్పదు కదా?’

‘ఆ సమయమువచ్చిన నేనే యోడిపోయి పడిపోదును పరీక్షకు చాలదా?’

'ఏమో! నాకంతయు దురూహ్యముగ నున్నది. మీ కార్యమెట్లు సాధించు కొందురో మీయిష్టము. నాకు మాత్రము మాట తెచ్చిపెట్ట వద్దని నామనవి.'

'సేనానీ! నా స్వార్థమునకై నీకు మాట రానిత్తునా? ఆవంత సంశయము వలదు.'

'సమస్తమునకును మీ రేయుత్తర వాదులు తల్లీ!'

తెల్లవారెను. అప్పుడొక యాశ్వికుడువచ్చి యొకయుత్తరము చక్రవర్తి పంపెననియు దండనాథు డెచ్చటనని యు ప్రశ్నించెను. సేనాని రాజకుమారి యున్న డేరాకా యాశ్వికుని గొనిపోయి యతడు తెచ్చిన యుత్తరము నామెకు సమర్పించెను. ఉత్తరము చూచుకొని యామె యాశ్వికునితో నిట్లని యెను.

'మేము యుద్ధము చేయరాలేదు. మీ చక్రవర్తి మాకభయమును వాగ్దానముచేసిన మాదండనాథుడువచ్చి తమతో మాటలాడునని మీచక్రవర్తితో చెప్పుము.' ఆశ్వికుడును నీ వార్తను చక్రవర్తికి తెలుప నాయనయు నందుల కంగీకరించి వచ్చి మాటలాడవచ్చునని వార్తనంపెను. అప్పుడామె సేనాని నేపథ్యమును తొడుగుకొని నిరాయుధముగ నశ్వముపై బయలు వెడలెను. చక్రవర్తి శిబిరము ముందర నశ్వమునుకట్టివేసి లోనికిపోయి చక్రవర్తికి నమస్కరించి యచ్చట నమర్చిన యాసనముపై యాదేశింపబడి కూర్చుండెను. అప్పుడు చక్రవర్తి యింకను మీసములురాని యింత చిన్న వయసున నాతడు దండనాథుడైనందుల కాశ్చర్యపడెను. ఆమెయు తన మూఢత తెలియకుండ వినమిత వదనముతో కూరుచుండెను.

కాని చూచిన వారెవ్వరైనను పరస్పరదర్శనము వారిహృదయముల నేదేనొక యనిర్వచనీయమైన మార్పుకలిగించె నను కొనక పోరు.

'అనక్షి లక్ష్యముగా నిట్టితరుల రాజ్యమున ప్రవేశించుట యేమి రాజనీతి?'

'మేము కయ్యమునకు రాలేదు. అట్లైన నింత చిన్న దండుతో వత్తుమా? మేము కార్యాంతర వ్యాపృతులమై తమ దేశము మార్గమధ్యమున నుండుటచే రావలసి వచ్చెను.'

'అయినను ననుజ్ఞాతులై రావలదా?'

'మీ సామ్రాజ్యమున ప్రవేశ నిషేధము లేదనివింటిమి. అందుచే సాహసించితిమి. మేమును రాజనీతి తెలియనివారము కాము.'

'ఎక్కడికి వెళ్లుచు మా దేశము మార్గముగా చేసికొంటిరి?'

'మేము జైనమతస్థులము. శ్రీవణబెగొళళమునకు యాత్రార్థ మేగుదెంచుచున్నాము. సమీప మార్గమగుటచే నీప్రాంతముద్వారా పోవుచుంటిమి.'

'నిజమే ననుకొన్నను యుద్ధ పరికరముల నేలగొని వచ్చినారు?'

'ఇంతదూరము ప్రయాణము చేయవలసి వచ్చినపుడు మార్గమధ్యమున చోరాదిదుష్టులవలన బాధలుండ వచ్చునని యట్లుచేసితిమి?'

'మార్గమున నట్టి వెచ్చుటనైన తటస్థించెనా?'

'ఎవ్వియు కలుగ లేదనుటకు మీరాజనీతియు పాలనా

దక్షతయు నికషములు.'

ఈమాటలకు చక్రవర్తి ముఖమున చిరునగ వలంకరించెను.

'అయినను నిట్లననుజ్ఞాతులైవచ్చి నందులకు మీరు శిక్షార్హులగుచున్నారు.'

'శిక్షార్హులైన శిక్షింతురుగాక. అంతకు పూర్వము నాదొక యభ్యర్థన మున్నది.'

ఈమాట లనినప్పు డామె ముఖమున మందహాసముతో పాటు రక్తిమయు నగపడెను.

'ఎట్టిదది? చెప్పుటకు సంకోచము వలదు?'

'మీకాగ్రహము వచ్చునని మాత్రమే సంకోచము.'

'రాదని యభయమిచ్చుచున్నాను. చెప్పవచ్చును.'

'తాము సర్వశాస్త్ర పారంగతులును, రాజనీతి కోవిదులును నని జగత్ప్రసిద్ధము. వానితోపాటు సమరశాస్త్ర నైపుణ్యమున్నదాయని నాకనుమానముగ నున్నది.'

'అనుమానమున్నచో పరీక్షింప వచ్చును.'

'పరీక్షయేగాని నిజమైన సమరము కాదు సుమా! ఆ విషయము ముందే నిశ్చయించు కొందము.'

'మేము ప్రతివత్సరమును యుద్ధప్రదర్శనములను చేయుచుందుము. దేశము సుభిక్షమై యుద్ధములే లేకపోయిన యుద్ధతంత్రము మరపునకు వచ్చునుకదా?'

'నా కోరినదియు నట్టి ప్రదర్శనమే యని యనుకొందురుగాక.'

'అయిన నశ్వముల మీదనా? ఏ యాయుధములతో? కుంతములా, శూలములా, విల్లంబులా?'

'తమతో నిట్టి స్వాతంత్ర్యమును గ్రహించి మాటలాడి నందులకు క్షంతవ్యుడను.' ఈమాటలనిపుడు ముఖమున విన్న దనము తోచెను.

'ఇందు క్షమించుట కేమున్నది? మనము శత్రువులము కాముకదా?'

'కాదుగనుక నే క్షమింప వేడితిని. శత్రువులమైన సమరాంగణముననే యెదుర్కొని యుందును.'

'దానికి తగినట్లు నేనును ప్రవర్తించియే యుందును. అందులకే వచ్చిరను కొంటిని. అందులకేవచ్చిన తత్ప్రావీణ్యమును చూచి యుందురు.'

'స్థల మెచ్చట?'

'ఉద్యానముననైన బాగుండును.'

'చూపరులును, పరీక్షకులును కావలెనా?'

'మీ యిష్టము.'

'మనమిద్దరమేయున్న జాలునని నామనవి.'

'అట్లైన పోదమురండు.'

చక్రవర్తి తమ వెంటనెవ్వరు నుండవద్దని యాజ్ఞ యిచ్చెను. ఇద్దరే యశ్వారూఢులై ధనుర్బాణములను గొని ఉద్యానమునకు వెడలిరి. అచ్చటి కొలకు ప్రక్కనున్న విశాలస్థలమున నిద్దరును కుహనాయుద్ధమునకు దలపడిరి. ఒకరు వే రెండవవారు తప్పించు కొనుటయు, తప్పించుకుని మరల వే రెండవవారు తప్పించుకొనుటయు నీవిధముగా నెన్నిబాణ

యోగములున్నవో యన్నియు నొకరిపై నొకరు వేసికొనిరి. అందులకు తగినట్లు గుఱ్ఱముల నడపుచుండిరి. ఒండొరులు బాణములను ప్రయోగించు కొనుచున్నను, నొకరినొకరు పుణ్యమునకు రెండవవారు మెచ్చుకొను చుండిరి. తుది ప్రయోగములో నామె గుఱ్ఱమునకు కాలుజారగా నామెక్రింద బడెను. వెంటనే చక్రవర్తి యశ్వమునుండిదిగి యామెవద్దకు వెళ్లి పరీక్షింపగా నామె కాలుబెణకెనని తెలిసెను. అప్పుడామెను మెల్లగా చేతులపైన దగ్గరనున్న నికుంజమునపరుండబెట్టి సరోవరము నీరు తామరాకున తీసుకొని సేదదీర్చిన కొంతకాలమున కామెకండ్లు తెరచి చూచెను. అదియేమి యాశ్చర్యమో కాని యావ్యక్తిని చేతులలో గ్రహించినప్పుడు శాతకర్ణి కావ్యక్తి పురుషుడు కాడను ననుమానము కలిగెను. కాని నిజమెరుగనిది సాహసింపకూడదని యూరకుండెను. మెల్లగ ముఖమును నీటితో తుడిచి, ఇపు'డెట్లున్నది?' అని యడిగెను.

'తమ కరస్పర్శము నా కమృతాసేచనక మైనది.'

'ఇంటికి పోదమా దండనాయకా?'

'నన్ను క్షమించిన నాదొక మనవి యున్నది.'

'ఏమది? నిస్సంకోచముగా కోరవచ్చును.'

'అది తెలుపక పూర్వమే మీరు క్షమించవలెను. అప్పుడేయది సార్థక మగును.'

'క్షమించితిని. ఇక చెప్పుము.'

'ఆమె ముఖముపై నొక వింతతేజస్సు పొడసూపెను.'

'మీరునన్ను దండ నాయకాయని పిలువ వలదు. నేను మీపాదసేవకై వేచియున్న కుసుమలతను. ఒక్కమారు నా

పేరును మీ యోష్ఠములతో నుచ్చరించిన విందును.'

'ఏమిది? నమ్మలేకున్నానే !'

'నాపై నేపథ్యము నూడదీయుడు. తమకేవిశదమగును'

శాతకర్ణి యట్లొనరించి కుసుమలతయని పోల్చుకొని, 'నేనెవ్వరి రూపమును హృదయమున ధ్యానించు చుంటినో యట్టి కుసుమలతవే నిజముగా నీవు ఏమని పిలుతును?'

'మీ యిష్టము !'

'కుసుమా ?'

'అబ్బ ! ఎంత శ్రోత్రి పేయముగా నున్నది? మరల ననవద్దు. ఆనందమును భరింపలేను, 'అనితనను తన పరివారము కడకు పంపమని వేడుకొనెను. శాతకర్ణియు జరిగినదాని కంతయు విస్మయాశ్చర్యముల నొంది యామె కోరికను నెరవేర్చి యామెకు వైద్యులను, పరిచర్యకు దాసీజనమును నియమించెను. తగిలిన దెబ్బ ప్రమాదకరమైనది కాకపోవుటచే ననుకున్న దానికంటె త్వరగనే యామెపునరారోగ్యము నొందెను. తల్లి దండ్రులాతురతతో నుందురని యికనామె వెళ్లదలచి యొకనాడు సాయంకాల ముద్యానవనమున నేకాంతముగానున్న సమయమున శాతకర్ణితో,

'ప్రభూ! నేనుచేసిన యవినీతికి నన్ను శిక్షింతునంటిరి. నేను కోరిన శిక్షవిధింతురా?' యని యడిగెను. శాతకర్ణియు నామె యుద్దేశమును గ్రహించి వల్లెయని యొప్పుకొనెను. ఆశిక్ష యెట్టిదో మనమెరుగము. ఊహించవలసిన దే.!

మరునాడు చక్రవర్తి తన స్వంతసేనను కొంతయిచ్చి

యామెను వీడ్కొల్పెను. మెరుపు తర్వాత గాఢాంధకారముల
మినట్లిద్దరి హృదయములును నంధకార బంధురము లయ్యెను.
కాని యా యనుభవించిన సుఖస్మృతి యుభయుల హృదయ
ములలో చిరస్థాయిగా నుండిపోయెను. శాతకర్ణి సపరివారముగా
ధాన్యకటకమును చేరెను. కుసుమలతయు కతిపయ ప్రయాణ
ములతో దంతపురముచేరి తండ్రికి తానుచేసిన పరీక్షను నివేదిం
చెను. తల్లిదండ్రులిద్దరును విశాల సామ్రాజ్యాధీశ్వరుడైన
శాతకర్ణి తమ కల్లుడగు నను సంతోషముతో, నప్పటినుండి
కుసుమలత పరులసొమ్మని భావించి యామెను ప్రేమతోబాటు
గౌరవముతో చూచుచుండిరి. కుసుమలత శాతకర్ణి చిత్రము
తో వినోదించుచు నెప్పుడెప్పుడు శాశ్వత పునస్సమాగమ
మగునాయనియువ్విళ్లూరు చుండెను. ఇట్లుండ నొకనాడు పాట
లీపుత్రమునకు పంపిన వేగులువచ్చి యచ్చటి స్థితిగతులను
ఖారవేలునకు విన్నవించి దండెత్తుట కదనువచ్చెనని సూచిం
చెను. ఖారవేలుడు సేన నాయత్తము చేయ నారంభించెను.
అంతఃకలహములచే నెంత బలహీనమైనను మగధ సామ్రాజ్య
లక్ష్మి సులభ గ్రాహ్యయా? ఇది ఖారవేలుని రాజ్యకా
లమున తృతీయ వర్షము. తన పేరున తన జైత్ర యాత్రలను
చెప్పుచు నొక శాసనమును వ్రాయించు చుండెను. ఈ
తృతీయవర్ష చరిత్ర నిట్లువ్రాయించ వలెనని యొక పాఠమును
తయారు చేయించెను. ఆకాలమున ప్రాకృతము రాజభాష
యగుటచే నాపాఠము నాభాషలో వ్రాయించెను.

'తుతయేచవాసే, అచితయితాశాతకణ్ణిం, పచ్ఛిమదిశం
హయగజనర బహులం, దండం పఠాపయతి, కణ్ణబెణ్ణాగత

యాంచ సేనయా, వికాసితం ముషికనగరం.'

కుమార్తెను పిలచి తాను వ్రాయించిన శాసన పాఠము నామెకు వినిపించెను. ఆమెయు నందుల కంగీకరించియు చక్రవర్తికి కూడ చూపిన బాగుండు నని తన యభిప్రాయ మిచ్చెను. అందులకు సమ్మతించి పాఠమును రాతిపైన చెక్కించక నట్టె యుంచెను. ఇంతలో చైత్రమాసము వచ్చెను. దండు వెడలుటకు తగిన కాలమిదియేయని యెంచి భవిష్యజ్జామాతృ సహాయమును వేడదలచి కుమార్తెతో తెల్పగా నామెయు నీ కారణమును పురస్కరించుకొని మరల ప్రియదర్శనమగునని సంతసించి యొంటరిగా వెడలుట కంటె నుభయబలములను చేర్చుకుని వెళ్లుటచే విజయము నిశ్చయమగునని తండ్రికి సలహానిచ్చెను. ఖారవేలుడును నందులకు హర్షించి యట్లే చేయ నిశ్చయించుకొనెను.

## పదియవ అధ్యాయము.

మగధరాజ్య చరిత్రను చూచిన లక్ష్మి చంచల యని రూఢియగును. నంద సామ్రాజ్యకాలమునుండి చేతులుమారుచునే యుండెను. నందుల తర్వాత మౌర్యులు సామ్రాజ్యము నతివైభవముతో పాలించిరి. మౌర్య సామ్రాజ్యమునకు చాణక్యనీతి ప్రాతిపదిక. చాణక్యుడు రాజ్య తంత్రవేత్తయై మౌర్యసామ్రాజ్యమును గట్టిపునాదులపై నిర్మించి యుండెను. చంద్రగుప్తుని తర్వాత నాయన మనుమ డశోకచక్రవర్తి చిరస్మరణీయుడు. ఆయన ధర్మరాజ్యమును స్థాపించి యొక్క భరత దేశముననేగాక బయటకూడ దానిని విస్తృత మొనర్చెన

ప్రాచ్యదేశములగు చీనా, జపాన్, బర్మా, కాంబోడియా, సింహళము, మొదలగు దేశములలో బౌద్ధ మతమున్నదన్న యీకీర్తి యంతయు నశోకునికే చెందవలసి యున్నది. తరువాత రాజు లంతపరాక్రమవంతులు కాకపోవుటచే సామ్రాజ్యము చేతులుమారవలసి వచ్చెను. మన కథనాటికి సుంగుడగు పుష్యమిత్రుడు చక్రవర్తిగ నుండెను. ఈయన మౌర్యరాజుల వద్ద సేనానిగ నుండి సమయముచూచి తుదిమౌర్య చక్రవర్తిని పడమార్చి చక్రవర్తి యయ్యెను. చక్రవర్తియైనను నితనికి సేనాని పుష్యమిత్రుడనియే ప్రసిద్ధనామము. ఆయనకును చక్రవర్తి యనిపించుకొనుట కంటె సేనానియని పిలిపించుకొనుట యే యిష్టమయ్యెను.

ఆకాలమున దక్షిణమున శాతకర్ణి సామ్రాజ్యమును ఖారవేలుని కళింగ రాజ్యమును ముఖ్యములు. విదర్భను జయింపదలచి తనకుమారుడగు నగ్నిమిత్రుని నచ్చటి కంపెను. ఆయనయు విదర్భను జయించెనుగాని యెక్కువ కాలముంచుకొనలేక పోయెను. శాతకర్ణి మరల విదర్భను జయించెను. వరదానది సరిహద్దుగా నుండవలెనని యిద్దరికి నొడంబడిక కుదిరెను. అచ్చట పరిస్థితులు సరిగా లేకపోవుటచే నగ్నిమిత్రుడచ్చటనే యుండిపోవలసి వచ్చెను. పుష్యమిత్రుడు దాదాపు వాన ప్రస్థాశ్రమమున కాలము గడుపుచుండెను. వయసున వృద్ధుడై పోయెను. ఇట్టిస్థితిలో తనకు చక్రవర్తి పదవిని వదలి వేయవలెనని యగ్నిమిత్రుని కోరిక. కాని పుష్యమిత్రుడట్లు చేయలేదు. అందుల కిద్దరకును మనసులలో నొకరిపై నొకరికి గర్భశైత్యములుండెను. అందుచే తండ్రి యెన్ని మా

రులు కబురంపినను నగ్నిమిత్రుడు పాటలీ పుత్రము పోలేదు. రాజప్రతినిధులీ పరిస్థితులను చూచి తండ్రి కుమారుల వైర మూతగాచేసుకొని యెప్పుడు స్వతంత్రుల మగుదుమాయని కాలమునకై వేచియుండిరి.

మగధ రాజ్యమునకు పాటలీపుత్రము రాజధాని. ఆ పట్టణము శోణానదీ గంగానదీ సంగమస్థానమున నిర్మింప బడి నది. పట్టణము నీరెండు నదులను రెండు కోటలవలె రక్షించు చుండెను. రెండు నదులును కలియుస్థలముననే యుభయ నదీ తీరముల రాజభవనము నిర్మింప బడెను. రాజ భవనమునకు సుగాంగమని చాణక్యుడు నామకరణ మిడెను. ఇది దుర్భేద్యమై ఒంటెమూన్య మును నున్నతతమ శిఖరమునుండి చుట్టుప్రక్కల నిరువదిమైళ్ల దూరమున నేమిజరుగుచున్నది చూచుటకనువై సుంగవంశ పతాకశోభితమై యొప్పారు చుండెను. కానికుమా రుని యౌదాసీన్యము చేతను, రాజప్రతినిధుల స్వాతంత్ర్య వాంఛచేతను, సామ్రాజ్యము కొంచెము బలహీనమైయుండెను. ఇటీవల నెక్కువగా దండయాత్రలు యుద్ధములు లేకపోవుటచే సేనానులును సైనికులును సోమరి తనమున కలవాటు పడిరి. ప్రజలుకూడ పుష్యమిత్రుని సైనిక శాసనములకు కొంచెము విముఖులై యుండిరి. పట్టణము వెనుకటి సంచలనముతో నిండి యుండలేదు. రాజభవనమున గూడ జీవితము గతానుగతిక మై నడచుచుండెను. పుష్యమిత్రుడు రాజభవనమును దాటి బయటికి వచ్చుటకూడలేదు. ఇట్లున్న పరిస్థితులలో సామ్రా జ్యమును రక్షించుకొనుట యెట్లు? ఈసమస్య యాతనిని బా ధించుచుండెను. యుద్ధనిపుణుడగు తనకాలములో నేయిట్లుండ

నికముం డెట్లుండును? తనకును కుమారునికి నేకవాక్యత లేన ప్పుడు రాజప్రతినిధుల నణచు టెట్లు? ఇట్టి విషయములన్నియు కూడ నాయనను బాధింప జొచ్చెను. కుమారు డొక్కమారు రాజధానికివచ్చిన విషయములన్నియు సమ్ముఖమున చర్చించు కొనవచ్చునని తలచెనుగాని యతడువచ్చు సూచనలు లేవు. ఆయనను పిలిపించ వలెనని తలచియుత్తరమును వ్రాసివార్తా హారునివలన పంపెను. ఇంకను సమాధానము రాలేదేమని విచారించుచుండగా నొకనాడకస్మాత్తుగా నొక యాశ్వికుడు సందేశమును తీసుకొని వచ్చెను. అందిట్లున్నది.

'పూజ్యులగు తాతపాదులకు. శిరస్సాష్టాంగ ప్రణామము లొనర్చిచేయు విజ్ఞప్తి. తమ యాజ్ఞను శిరసావహించవలెనని యున్నదిగాని యిచ్చటి రాజకీయ వ్యవహారములు విషమముగా నున్నవి. ఉత్తరమున మన మాళవ ప్రతినిధి రాజాజ్ఞలను పాటించుటలేదు. దక్షిణమునుండి శాతకర్ణి యెప్పుడు పైనబడునో యను భయమున్నది. అనుక్షణము నప్రత్తులమై యుండు నావశ్యకత కలదు. తమ యాజ్ఞ నుల్లంఘించితినని తమరు తలంచ వలదని నావిజ్ఞప్తి. ఉజ్జయిని యంతయు కల్లోలముగా నున్నది. ప్రజలందరు నిరుపక్షములై యున్నారు. రాజ ప్రతినిధి క్రమముగా బలములను చేకూర్చు కొనుచున్నాడు. ప్రక్కబల్లెమునవలె మనమున్నగాని వానియాటలు కట్టవు. ఇక వరదానది యిరుప్రక్కలును సేనాశిబిరము లైపోయినవి. కావున నన్ను మన్నించి తమ సముఖమునకు రాలేకపోయినందులకు క్షమించ వలెనని విన్నవించు.

మీ ప్రియపుత్రుడు

అగ్నిమిత్రుడు.'

ఈ యుత్తరము చూచి పుష్యమిత్రుడు మంత్రిని పిలి పించి మంతనములు గావించెను.

'ఏమోయి! విరాధగుప్తా! అబ్బాయివ్రాసిన లేఖచూచి తివిగదా? నీయభిప్రాయ మేమి?'

'వారు వ్రాసినయంశములును నౌదాసీన్యము వహింప తగినవి కావు.'

'అబ్బాయి యిట్లును, రాజప్రతినిధు లట్లును నైన నిక మన సామ్రాజ్యము మాటయేమి?'

'సామ్రాజ్యమునకు భయమున్న దనుకొనను.'

'నీధైర్యమున కాశ్చర్య మగుచున్నది. మనకు దక్షిణ మునబలముగల శత్రువులున్నారు.'

'అవును! అయిననుయువరాజు అగ్నిమిత్రులవారు శాత కర్ణిని కదలకుండ చేయగలరు. ఖారవేలు డొక్కడు మనపైకి దాడివెడలుటకు సాహసింపడని నాయభిప్రాయము.'

'ఉభయులును బలముకలవారే! ఉభయులు రాజ్యవిస్త రణకాంక్ష కలవారే!'

'అందువలననే ముందు వారిద్దరును తారసిల్లరని నా యూహ.'

'ఏ కారణములవలన నీవట్లూహించితివి?'

'ఉభయుల మతములు విరుద్ధములు. ఇది యొక్క ప్ర బల కారణము.'

'అట్లనుకొనుటకు వలనుపడదు. రాజ్య కాంక్షవలన నీ వైరుధ్యము పోవచ్చును. వీరిద్దరిలో ఖారవేలుని రాజ్యకాంక్ష గొప్పది. ఆతని రాజ్యము చిన్నదగుటచే విస్తృతి యొనర్చ

వలెనని శ్రీమపడు చున్నాడు. దక్షిణమునకు వ్యాపించుటకు శాతవాహనసామ్రాజ్యము దట్టమైదుర్భేద్యమైయున్నది. పశ్చిమమునకూడ నదియేకలదు. ఇక విస్తారము మనవైపునకే జరుగవలయును. మనమా చీలియున్నాము. సామ్రాజ్యమునకు ముప్పు వచ్చుననియే నాకతోచుచున్నది.'

'తమరట్లు నిరుత్సాహ పడవలదు. తమరే యట్లుండిన నిక మాసంగతి యేమి?'

'పశ్చిమమునుండిమినాండర్ దుముకనుంకించుచున్నాడు. యువరాజీ యాపత్తులనన్నిటిని నెదుర్కొన గలడను నాశ నాకు లేదు. నాజీవితములో నే యిట్టి పరిస్థితులు తటస్థించునని యెన్నడు ననుకొనలేదు.'

'ప్రభూ! తమ రింత యాదుర్దా పడనవసరము లేదు. వెంటనే మనకెట్టి యాపత్తును వచ్చునని యూహింపజాలకున్నాను. క్రమముగా సంగతులు మారగలవు.'

'ఏమి మారునో! యువరాజు ప్రవర్తన దురూహ్యము గానున్నది. ఒక్కమారు మేమిద్దరము కలియుదమన్న నది తటస్థించుట లేదు. వార్తాహరులేమైన వార్తలను తెచ్చిరా?'

'ఏదో దంతపురమున కొంత సంచలనమున్నదని చెప్పుచున్నారు. కాని యిప్పుడే యెట్టియాపద వచ్చుననుకొనుటకు కారణ జాత మగుపడదు.'

'అయినను కోటబురుజులను బాగుచేయుట మంచిది. అగడ్త నిండ నీళ్ళునింపియుంచ వలసినది. ఉభయనదీతీరముల రక్షణదళమల నుంచుట యవసరము.'

'చిత్తము మహారాజాజ్ఞ.'

ఈ సంభాషణమైన తరువాత కొన్ని నెలలు గడిచినవి. మరల వసంతఋతువు వచ్చువరకును నెట్టిభయమును కలుగలేదు. కాని సామ్రాజ్య పరిస్థితులలో నెట్టి మార్పును కలిగినట్లు కానరాదు. అయోధ్యలోనున్న మగధసామ్రాజ్య ప్రతినిధి కూడ స్వార్థపరుడై యున్నట్లును, మనాండర్ సేనలనుకూర్చు చున్నట్లును వార్తలు తెలియవచ్చినవి. ప్రజలలో నెట్టిమార్పు ను కలిగినట్లు కానరాదు. కొంత కాలమునుండి తీవ్రములైన యుద్ధములు లేవు. మొత్తముమీద పుష్యమిత్రునికి మనశ్శల్యమైనదే బాధించుచుండెను.

పురవీధులలో సంచరించువార నేక సంభాషణలను వినుచుందురు.

'ముసలివానికింత కాంక్షయేల? కుమారునికి రాజ్యము వశముచేసి తాను విశ్రాంతి గైకొనవచ్చునే!'

'అలాబుద్ధి పుట్టునా? ఐశ్వర్యము కాంక్షించని వారుందురా?'

'అది యంతయు యౌవనదశలో వృద్ధుడై యొడలు ముడుతలుపడినవెనుక యాకాంక్ష యుండకూడదు.'

'అధికారివర్గము నందులకు తగినట్లెవర్తించుచున్నది.'

'ఆమాటనిజము. ఎచ్చట చూచినను ద్రోహమే! లంచగొండి తనమే.'

'ఇట్టి పరిస్థితు లెక్కువ కాలము నిలువజాలవు.'

'మనకేల! మనకే రాజైనను సరియే!'

'అయినను నీమగధరాజ్యప్రారబ్ధమే మో కాని యొక్క రాజ కుటుంబమైనను నిలకడ కల్గియుండ లేదుకదా?'

'ఈ సుంగవంశము మౌర్యవంశముకంటె గొప్పదా యేమి?'

'అన్నిటెటు చూచినను దుశ్శకునములేగాని వేరుకానరావు.'

'సైనికులుకూడ యాజ్ఞలను పాటించుట లేదు.'

'పరిఘలో నీళ్లు నిండ లేవు.'

'ఆయుధాగారము పాడుకొంపవలె నున్నది.'

'రక్షకభటులుతమ కర్తవ్యములను తిన్నగా చేయుచుండ లేదు.'

'ఎక్కడి వారక్కడ స్వతంత్రులగుటకు యత్నించుచున్నట్లు వినికిడి.'

'ఏమో! ఏమిరానున్నదో మనమెఱుగము?'

ఇట్టి సంభాషణలన్ని వినువారవి యన్నియు సామ్రాజ్య విచ్ఛిత్తికి ధూమకేతువులని యనుకొనక మానరు.

## పదునొకండవ అధ్యాయము.

సూర్యుడు మేషరాశిని ప్రవేశించెను. క్రమముగా నాయన తీక్ష్ణుడగుచుండెను, తన మార్గమును ఉత్తరమునకు మార్చుకొనుచుండెను. హిమాలయమునందు పుట్టిన నదులన్నియు క్రమముగా నీరుహెచ్చి వరదలై ప్రవహించెను. ఉద్యానవనములలోని మల్లెతీగలన్నియు మొగ్గదొడిగి పుష్పించుచుండెను. మామిళ్ళుకొన్ని చిగిర్చియు, మరికొన్ని పుష్పించియు, నింక కొన్ని ఫలోన్ముఖములయ్యెను. కోయిల చిగుళ్ళను మేసి తన కంఠమును సవరించుకొని కుహూనాదములను చేయుచుండెను.

బాలురు కుహూనాదముల ననుకరించుచు నుద్యాన పరిసర ప్రాంతములలో నాడుకొనుచుండిరి. నదులు సైకతశ్రోణులై తమ మంద గమనములతో కృశాంగులవలె నుండెను. రాజ మార్గములమధ్య ప్రయాణీకుల సౌకర్యము కొరకై చలువ పందిళ్ళు, చలివేంద్రలు నమర్చబడు చుండెను. దూరదేశ ప్రయాణములు చేయదలచిన వారు మూటలు ముల్లెలు కట్టు కొనుచుండిరి. పాఠశాలలలో పరీక్షలు దగ్గరకు వచ్చుచుండెను. శ్రీరామనవమి సందర్భములో వసంత నవరాత్రములు పలుతా వులలో నారంభ మగుచుండెను. ఆడపిల్లల వివాహములకును, మగపిల్లల యుపనయనములకును శుభ ముహూర్తములను వెదకికొని గృహస్థులు సన్నాహములను జరుపుకొనుచుండిరి. గ్రామ వీధులలో గ్రామీణ ప్రజలు నిర్భయముగా నరుగుల మీదను, నారుబైటను పండుకొను చుండిరి. వ్యవసాయదా రులు పొలముపాటు నారంభించిరి. దేశమాతయు వసంతశోభ యావరించి యుండెను. ప్రకృతి విచిత్రము దురూహ్యము. ఎండకాలముననే మామిడిపండ్లు మొదలగు నుష్ణపదార్థములను సృష్టించును. మండు టెండలోనే ముట్టుకొనిన వాడిపోవు మల్లెలు వరలును. ఈ వైవిధ్యము కలిమిలేములు కావడి కుండ లని ప్రపంచమునకు చాటుచుండెను. శాతవాహన చేదిరాజ్య ములు రెండింటిలోను నెక్కడను చోరభయ మనునది లేదు. ప్రపంచమంతయు వసంతకాలమున సుఖసౌఖ్యముల ననుభ వించుచుండ నిద్దరు వ్యక్తులు మాత్రి మొండొరుల యెడబా టుకు విచారగ్రస్తులై యుండిరి. వారెవరో చదువరు లూహిం చుకొనుట కష్టముకాదు.

ఇట్లు చైత్రలక్ష్మి ప్రపంచమునంతను తన శోభతో నింపుచుండ, శాతకర్ణి తన పురవాసులకు శ్రీరామ నవమినాడు తాను దర్శనమిత్తునని ప్రకటించెను. ఆనాడు చక్రవర్తి జన్మ దినోత్సవము. అందులకై పట్టణమంతయు పండుగదిన మయ్యెను. ఎచ్చట చూచినను ప్రజలముఖములు సంతోషముతో నిండియుండెను. అన్ని దేవాలయములలోను పూజాఘంటికలు మ్రోగుచుండెను. దేవాలయములలోను చక్రవర్తి గోత్ర నామములతో పూజలు జరుగుచుండెను. ఒకవైపు సేనావిన్యాసములును, మరియొకవైపు వస్తు ప్రదర్శనములును, ఇంకొకవైపు బాలబాలికల కోలాటపు టాటలును, చెల రేగెను. సాయంకాలమున జరుగబోవు నాస్థాన సభలో చక్రవర్తి తన ప్రజలకు దర్శనమిచ్చిన వెనుక పండిత పారితోషికములును, దానములును జరుగునని ప్రకటింప బడెను. మధ్యాహ్నమునుండియే సభామంటపమునకు వెడల ప్రజలారంభించిరి. మేనుముందు మేము ముందను నహమహమికతో ప్రజలు వెడలుచుండిరి. సుమంతులవారును భట్టాచార్య ద్వయమును, శివనాగ భట్టాచార్యులవారు నింద్రశ్రీయు మొదలగు నాప్తులు ముందు వరుసలలో కూర్చొని యుండిరి. ఒకవైపున, మేళ తాళములును, నింకొకవైపున వాగ్గేయకారకుల సంగీత వాద్యములును మ్రోగుచుండెను. చక్రవర్తి వచ్చుచున్నాడని గుసగుస లారంభమయ్యెను. ఆయనను చూడగనేయావత్సభయు నిలచి, గౌరవించెను. చక్రవర్తి సింహాసన మధిష్ఠించి పెద్దలకు నమస్కరించి తన వెనుక నమర్చబడియున్న నాగానికా మహాదేవి చిత్రపటమును పుష్పమాలాలంకృతము

గావించెను. సభాసదుల కరతాళధ్వనులు చెలరేగెను. చక్రవర్తి యాసీనుడైన తదుపరి సభాసదులందరు నాసీనులైరి. ముత్తైదువులు నీరాజనముల నొసంగిరి కవులు పద్యముల జదివిరి. గాయకులు చక్రవర్తి గుణగణముల బాడిరి. తుదకు వేదాశీర్వాదములు చెలరేగెను. ఒక ముసలి ముత్తైదువు వచ్చి చక్రవర్తి ఫాలభాగమును కుంకుమతిలకముతో నలంకరించెను. చక్రవర్తికి వివాహకళవచ్చినదనియు త్వరలోనే వివాహమగు చిహ్నాను లగపడుచున్న వనియు ప్రజ లనుకొనసాగిరి. ఇట్లు సభామండపమంతయు సంతోషముతో నిండియుండగా ఖారవేలుని వద్దనుంచి యొక సందేశహారి వచ్చెననియు ద్వారము కడ వేచియుండెననియు సమాచారము వచ్చెను. చక్రవర్తి సభ చాలించెను. భవనములోనికేగి యావార్తాహరుని బిలువనంపెను. ఆతడును నొక మోకాలు వంచి చక్రవర్తి కొక తాళపత్రమునందించెను. సుమంతులవారిని చక్రవర్తి కబురంపగా నాయనవచ్చెను. చక్రవర్తి కమ్మనుమంత్రికందిచ్చెను. ఆయన దానిని చదువ నారంభించెను.

'శ్రీమన్మహారాజ, రాజ పరమేశ్వర శాతకర్ణి చక్రవర్తి సమ్ముఖమునకు చేదిదేశాధీశ్వరుడు ఖారవేలుడు వ్రాయు విజ్ఞాపనము. తాము సుఖముగానున్నారని భావింతును. పాటలీపుత్రమునుండి మావేగులువచ్చి యచ్చటి పరిస్థితులు సక్రమముగా లేవనియు, మగధసామ్రాజ్యము నశించు సూచనములు కన్పట్టుచున్నవనియు వార్తలు తెచ్చిరి. మగధ తరువాత తమ సామ్రాజ్యమును, తర్వాత యస్మచ్చేదిరాజ్య మున గొప్పవని తమకు నేను వేరుగా వ్రాయనవసరమ

లేదు. మన మఖ్రయుల మీదే యవకాశముగ గ్రహించి యుభయబలములతో మగధ రాజ్యముపై వెడలిన మన నడ్డుకొనువారు లేరు. గంగా తీరమునుండి తుంగభద్రా తీరమునకు మన ముఖ్రయులము నప్రతిహతముగా నేలుకొన గలము మీతో మాకు స్పర్ధగాని విరోధముగాని లేదు. మాయమ్మాయి తమ శౌర్యపరాక్రమములను మాకు విన్నవించినది. తత్ఫలితమే మన సఖ్యము. ఈ సఖ్యము బాంధవ్యముగా మారవచ్చునను నాశతోనున్నాము. కావున విజయానంతరము మాయభిప్రాయ మెట్లుండునో యని మీరు సందేహింప బనిలేదు. మా చతురంగ బలమంతయు సంసిద్ధముగా నున్నది. పుష్యమిత్రు డగ్నిమిత్రుని రాజధానికి రమ్మని యాజ్ఞల నంపినను, నతడు దాని నిరాకరించినట్లు వేగులవార్తలు. తమ యుత్తర సీమ యగు వరదానది వద్ద మాత్ర మగ్నిమిత్రు నెదుర్కొనుటకు తగినబలము నుంచినజాలును. ఇతర వైపులనుండి మీసామ్రాజ్యమునకుగాని మా రాజ్యమునకుగాని యపాయము కానరాదు. తమ సామ్రాజ్యసైన్యముపై రెండుకార్యములకును సమర్థమని యే నానమ్మకము. పైఠనునగరముననున్న రాజప్రతినిధి సమర్థుడై యున్నాడని నాతలంపు. తమ రాజనీతినిగూర్చి నేను తమకు సలహాలనిచ్చుచున్నానని భావింప వలదని నా మనవి. అమ్మాయివల్ల తమ విశాల సామ్రాజ్యమున నెచ్చటను నెట్టియీతిబాధలు లేవనియు, అంతయు సుభిక్షమై, ప్రజలు సామ్రాజ్యము నెడల మిక్కిలి యనురక్తులై యున్నారనియు విని మిక్కిలి సంతసించితిమి. అమ్మాయి తరుచుగా తమ సంగతులు చెప్పుచు మనస్సులలరించుచుండును. ఇప్పుడు నేనుల్లేఖించిన కార్యము

వకు కాలము తక్కువగా నున్నది. త్రోవలో మహానద్యాదుల నిప్పుడే నిర్నిరోధముగా దాటవచ్చును. వర్షములు కురిసిన వెనుక మన కార్య మసాధ్యమగును. కాలమునకు వేచి సకాల మున నే క్రియ జరుపుట రాజనీతి. మనకిక రెండు నెలల కాల ముున్నది. వివిధ రాష్ట్రములలోనున్న కల్లోల పరిస్థితులనుబట్టి పాటలీపుత్రము నందుండెడు సేనలు వివిధరాష్ట్రములకును విభక్తములై పంపబడినట్లు మనవార్తాహరులు చెప్పుచున్నారు. మన యుభయ సేనతోను నెదుర్కొనగలిగినంతసేన యిప్పు డచ్చట లేదు. మరియు నీవిషయమున నేను కొంతకాలము నుండి యత్నించుచుంటిని. మా సైనికులను కొందరనంపి య చ్చటి సైనికులను చీలదీసితిమి. కొందరు సేనాపతులు మన కనుకూలురై యున్నారు. ఇదే సమయము. మీరును నన్ని విషయములను పరిశీలించి నేను వ్రాసిన యంశమును గూర్చి యాలోచించి తగుచర్యతీసుకొన వలయుననినాయభ్యర్థనము.'

సుమంతులవా రుత్తరమును చదివిన తరువాత రుద్ర భట్టారకులవారిని, శివనాగ భట్టాచార్యుల వారిని పిలిపింపు మని చక్రవర్తి కోరెను. వారువచ్చి ఖారవేలుని యుత్తరము నందలి యంశములను జాగ్రత్తగా విన్నమీదట వాటిని పరిశీ లించుటకై నల్గురును సమాలోచనసభ గావించిరి. సుమంతుల వారుత్తరము నందలి యంశముల నొక్కొక దానిని విస్తరించి తెలిపిరి.

'సామ్రాజ్య విస్తీర్ణము మనకందరకును సంతోషకార్య మే! కాని ఖారవేలుని వచనముల నెంతవరకు విశ్వసింప నగు

నో యదియిప్పుడు చర్చించ వలసిన విషయము' అని రుద్ర భట్టారకు లనెను.

'ఖారవేలునికి పుత్రసంతానము లేదు. ఏకైక పుత్రి. ఆమెయు చక్రవర్తిపై బద్ధానురాగయై యున్నట్లు వినికిడియే గాక ఖారవేలుని యుత్తరమునుండి కూడ ధ్వనించు చున్నది.' అని సుమంతులవారనినప్పుడు చక్రవర్తి సవినయ లజ్జముగా తలవంచు కొనెను. మౌన మంగీకార సూచకమని నిశ్చయించి సభాసదులందరును తరువాత విషయములపై దృష్టిమరలించిరి.

'అది స్వవిషయము. కానియది సామ్రాజ్యమునకు విరుద్ధమైన యెడల నాసౌఖ్యమును విడనాడ సంసిద్ధుడనై యున్నాను' అని చక్రవర్తి యనినప్పుడు తానావిషయము నెత్తుకొనినందులకు రుద్రభట్టారకులు పశ్చాత్తాపపడి,

'నామాటలు శ్రీవారికి మనస్తాపమును కల్గించకుండు గాక! నేను లోకవృత్తము ననుసరించియే పలికితినిగాని వేరొండు కాదు.' అని రుద్రభట్టారకులు క్షమాపణ వాక్యములను పలికెను.

'ఇందు మనస్తాప మొంత మాత్రమును వలదు. ఇట్టి విషయములు చర్చించునపుడు మొగమాట మొంతమాత్రమును కూడదు.' అని చక్రవర్తి యనినప్పుడు భట్టారకులకు మనశ్శాంతి కలిగెను.

'ఖారవేలుని యుద్దేశమున సంశయము లేనపుడిక సంకోచమునకు తావులేదు.' అని శివనాగ భట్టాచార్యులవారనెను.

'ఇదివరకు తాను చేసితిననిన పనులెంతవరకు మన కను కూలించునో మన మాలోచించ వలసిన రెండవ విషయము.' అని సుమంతుల వారనిరి.

'మనము సామ్రాజ్య విస్తార కాంక్షను విడనాడ లేదు. కాని యందభినివేశము మనము పెట్టుకొనలేదు. కాని ఖార వేలుని విస్తారకాంక్ష కించను పారము కనవడ లేదు. ఆయనకు మగధ చక్రవర్తి కావలెనని యున్నట్లు స్పష్టమగు చున్నది.' అని చక్రవర్తి నిర్మొగమాటముగా ననెను.

'అందు తప్పేమున్నది? 'అసంతుష్టోద్విజో నష్టస్సంతుష్ట శ్చైవ పార్థివః' అనిగదా యార్యోక్తి!' అని శివనాగ భట్టా చార్యులవా రనెను.

'మన మిదివరకే చక్రవర్తి పదవాచ్యుల మైతిమికదా! ఆయనకు నట్టి యుద్దేశ ముండ వచ్చును.' అని చక్రవర్తి పలికెను.

'మగధరాజ్యము జయించితి మనుకొందము! అప్పుడు చక్రవర్తుల మగు మనమా రాజ్యచక్రవర్తిత్వ మాయనకిచ్చి వేయుట సమంజసమాయని యాలోచింపుడు' అని శివనాగ భట్టాచార్యులవారు ప్రశ్నించిరి. అందరి కండ్లును చక్రవర్తిపై పడెను. చక్రవర్తియు నాలోచించినట్టు కన్పట్టెను.

'ఒక్క విషయ మాలోచింప దగినది. ఇందుననే తమ నిశ్చితాభిప్రాయము నేనుకోరునది' అని చక్రవర్తి విశదీక రించెను.

'తమకు తగిన మంత్రాంగమును చర్చించుటకే కదా

మన మిచ్చుట సమావేశమైతిమి?' అని సుమంతులవారు నిస్సంశయముగా పలికిరి.

'ఆయన కేకపుత్రి. పుత్రసంతానము లేదు. ఆమెను నాకియ్యవలెనను ధ్వనిని యుత్తరమున సూచించినట్లు మీరుగ్రహించితిరి. మన మిదివరకే చక్రవర్తి పదము నధిష్ఠించి యున్నాము. ఆయనను కూడకొంతకాలము చక్రవర్తి పదమునధిష్ఠింప నంగీకరించుటలో తప్పేమియును లేదు. ఆయన తర్వాత మన కదికూడ నాయన రాజ్యముతోపాటు సంక్రమించగలదు. అత్యాశ యుండకూడదని నాకు తోచుచున్నది.' అని చక్రవర్తి యనగా నందరును నిరుత్తరులైరి.

'ప్రభూ! రాజ్య తంత్రమునకును సంతుష్టికిని విరోధము కన్పట్టును. తమ యభిప్రాయము సమంజసమె యైనను పునర్విచారణీయము' అని సుమంతుల వారనెను. ఈమాటలు రుద్రభట్టారకులను ప్రోత్సహింపగా, 'నాకు నట్లే తోచుచుచున్నది. అని యనెను. అప్పుడు చక్రవర్తి వారివంకచూచి,

'మరియొక సంకోచము నామనమును బాధించుచున్నది. మగధ రాజ్యలక్ష్మి చంచలగా కన్పట్టుచున్నది. ఏవంశమునందును సుస్థిరయై నిలువలేదు. మౌర్యవంశము మిక్కిలి తేజోవంతమును పరాక్రమ వంతమునైనను, నామె, తర్వాత సుంగ వంశమునకు మారినది. మన సామ్రాజ్య మేనాడు శ్రీముఖులు స్థాపించిరో యప్పటినుండి పెరుగుదలయే గాని తరుగుదల కాన్పించలేదు. అత్యాశకుపోయిన మన సామ్రాజ్యమునకే ముప్పువచ్చునేమోనని నాయంతరాత్మ సంశయించుచున్నది. చంచలయగు మగధరాజ్యలక్ష్మిని ఖారవేలునకే యొప్పజెప్పిన

మంచిదని నాయాశయము. ఈవిషయమును మీరందరును జాగరూకతతో పరిగణింప వలెనని నామనవి.' అని చక్రవర్తి యనగా మంత్రులందరును సంకోచించుచుండ, 'ఆయన తత్సనంతరమైనను తమరన్న యనుమానము వర్తించుట లేదా?' అని శివనాగ భట్టాచార్యులవారు ప్రశ్నించిరి. చక్రవర్తి యందుల కాలోచించి, 'ఆపీఠ నాయనమీదుగనే పోనిండు. మరియొక దృక్పథమును తమయెదుట నివేదించుచున్నాను. ఖారవేలుడు మగధ చక్రవర్తియై తనపితురార్జితమును స్వార్జితమును మన కిచ్చిన గ్రహించవచ్చునని నానమ్మకము.' అని చక్రవర్తియని నప్పుడు ముగ్గురు మంత్రులును శిరఃకంప మొనర్చిరి. తరువాత చక్రవర్తి మరలనిట్లనెను, మనము మగధరాజ్యమును కట్టుకొనిన యెడల మన స్వసామ్రాజ్యమునకును నూతనముగ ఆధిష్ఠించిన సామ్రాజ్యమునకును మధ్య పరరాజ్యమైన కళింగ మడ్డమగును. ఏవేని క్లిష్ట పరిస్థితులు తటస్థించినపుడు మనకది యవరోధముగ నుండును. కావున దూరమున నున్న మగధసామ్రాజ్యమును ఖారవేలునకేవదలి, వారి కళింగమును మనము గ్రహించిన మన సరిహద్దుననున్న రాజ్యమును నిలువబెట్టుకొనుట మనకు సులభమగును. మరియు ఖారవేలునకును మనకును మధ్య శత్రువుండడు.' అని చక్రవర్తి మంచి చెడ్డల నాలోచించి చెప్పినపుడు మంత్రుల ముఖములు వి సించెను.

'శ్రీవారి రాజనీతి యసమానము. అప్పుడు మన సామ్రాజ్య విస్తృతి కార్యముకూడ ఏకకాలమున జరుగును' అ సుమంతులవారు చక్రవర్తి వాక్యముల యంతరార్థమును స్పష్టీకరించిరి. శివనాగ భట్టాచార్యులవారు ఖారవేలపుత్రి, ప్రేమో

దంతమును తెలిసినవారుగాన కళింగరాజ్య మిప్పుడు కాకపో యినను, ఖారవేలుని తదనంతరముననైనను చక్రవర్తియందు స్థిరమగునని మనమున నూహించి, 'శ్రీవారి యూహ మిక్కిలి సమంజసము. ఈ కార్యమున ఖారవేలునితో మనము సహక రించవలెనని నానమ్మకము.' అని స్పష్టముగా నుడివెను. అంద రునుకూడ భట్టాచార్యులవారి యూహతో నేకీభవించిరి. దండు సిద్ధము చేయవలెననియు, పైఠను రాజప్రతినిధిని మా త్రము వరదా తీరసీమను జాగ్రత్తగా కాపాడుటకు చాలిన రాణువును సిద్ధముచేయ నాజ్ఞాపించ వలెననియు, త్వరలోనే ప్రయాణ సన్నాహము చేయవలెననియు, ఖారవేలునకు వెం టనే యంగీకార సూచకముగ కమ్మవ్రాయించ వలెననియు సమాలోచన సభలో తీర్మానమయ్యెను. సుమంతులవారిని ఖారవేల లేఖకు ప్రత్యుత్తరము వ్రాయుమని చక్రవర్తి యా జ్ఞాపించెను. ఆయనయు నప్పుడే యుత్తరము వ్రాసి రాజముద్ర వేయించి ఖారవేలుని లేఖను తెచ్చిన వార్తాహరుని చేతనే, యీకమ్మనుకూడ పంపెను. నాటి యాలోచనాసభ ముగి సెను. దానితోపాటు పైఠను రాజప్రతినిధి కొరకు యుత్తర మునుకూడ వ్రాసిరి. దండును సిద్ధముచేయ వలెనని సేనాని కాజ్ఞలు వెడలెను.

## పన్నెండవ అధ్యాయము.

చేదిదేశ మంతటను సంచలనము కలిగెను. ప్రతిపట్ట ణమునందును పల్లెయందును సైనికశిక్షణము చెలరేగెను. చతు రంగబలములు క్రమముగా రాజధానికి చేరుకొను చుండెను.

బలమునకు కావలసిన వస్తుసంచయ మంతయు చేకూర్చ బడు చుండెను. సైనికులు తను బాహుబలమును వినియోగించుటకును, తమ రాజభక్తిని చూపుటకును కాలము వచ్చినందులకు సంతసించు చుండిరి. దంతపుర మొక గొప్ప సేనావ్యూహ మయ్యెను. సైనిక విన్యాసములు నడుపువారును, వివిధ యుద్ధ ప్రయోగములలో శిక్షణము నిచ్చువారును, వివిధాయుధములను తయారుచేయు వారును, వివిధ సామగ్రీ సేకరణ మొనర్చువారును, ఈవిధముగ ప్రజలందరును నెవరి విధ్యుక్త ధర్మములను వారు నిర్వర్తించు చుండిరి. ఖారవేలు డింకను శాతకర్ణివద్దనుంచి.వార్తరాలేదేయని తహతహలాడుచుండెను. ఎట్టివార్త వచ్చునోయనికూడ సంకోచించుచుండెను. కుసుమలత మనమున మాత్రము శాతకర్ణి తప్పకవచ్చునను నమ్మకము ప్రబలముగ నుండెను. ఇట్లుండ నొకనాడు శాతకర్ణి వద్దకు పంపిన దూతవచ్చెనని ఖారవేలునకు కబురువచ్చెను. వెంటనే రమ్మని యాజ్ఞాపింపబడి యాదూత శాతకర్ణియిచ్చిన యుత్తరమును రాజునకు సమర్పించెను. ఆయనయు దానిని చూచుకొనిశాతకర్ణి యయిదు దినములలో వచ్చుననెడి వార్తకుసంతోషించి యాసమాచారము కుసుమలతకు తెలుపగానామె మోము వికసించెను. ఆ దినమంతయు నామె యాలోచనా మగ్న మానసయై మరునాడు తండ్రివద్దకు వెళ్లి యాయనతో,

'నాన్నగారూ! నా కోరిక యొకటి కలదు. కోపగించుకొందురేని మనవి చేతును.' అనెను.

'తల్లీ! ఎన్నడైనను నీకోరిక కాదంటినా?'

'కాదనలేదు. కాని యీవిషయమున మనమాందోళన ము నొందుచున్నది.'

'నీవు కోరకూడని కోరిక కోరవని నాకు నమ్మకమే! కావున తెల్పుము.'

'నాకుకూడ యుద్ధమునకు వచ్చుటకు సెలవియ్య వల యును.'

'అమ్మా! ఇది యుద్ధము. ఎంతకాలము పట్టునో యెంత నిశితముగ నుండునో, పర్యవసాన మేమగునో చెప్పలేము.'

'కావుననే నేను వచ్చెదనని యభిలషించుట!'

'అయినను మీ అమ్మ యభిప్రాయమును కనుగొనుట కూడ అవసర మగును.'

ఇంతలో సాగరానికా దేవియు నచ్చటికి వచ్చెను. క్షీరవేలు డంత,

'అమ్మాయికూడ యుద్ధమునకు వచ్చెద ననుచున్నది. నీవేమందువు?' అని యామె నడిగెను.

'అమ్మాయి యీకోరిక కోరునని నాకు ముందే తెలు సును. మీరును నమ్మాయియు వెడలునపుడు నేనిక్కడ నొంటరిగ నుందునా? నేనుకూడ వత్తును. చిత్తమువచ్చుట కష్టే బరమిచ్చుట! నేను భరింపజాలను.' అని సాగరానికాదేవి యనగా నీమాటలు కుసుమలతను మరింత ప్రోత్సహించెను.

'నాన్నగారూ! అందరము వెడలుదము.'

'పెండ్లికిపోవుచు పిల్లిని చంకబెట్టుకొని పోయినట్లు స్త్రీ జనరక్షణము కూడ నొక కర్తవ్యమగును.'

'నన్ను నేను రక్షించుకొందును' అని కుసుమలతయనె,

'నన్నేనా నేను రక్షించుకొనలేనిది? నాకుకూడ మా నాన్నగారు యుద్ధశిక్షణ మిచ్చినారు.' అని సాగరానిక యనెను. ఖారవేలుడు మారు మాటాడలేక యొప్పుకొనక తప్పినది కాదు.

'నాన్నగారూ! దీని నియ్యకొనినారు. సంతసము. నాకు మరియొక కోరిక కలదు.'

'అదియు నిట్టిదేనా?'

'దీనికి సజాతీయమే! నన్నొక దండనాయకునిగా నియమింపుడు. నేనుకూడ యుద్ధమున పాల్గొనవలెనని కుతూహల పడుచున్నాను.'

'మీరందరును సమరమున పాల్గొనువారలా? నేను పిరికిదానవా? ఆర్యపుత్రా! నేను తమకు సహధర్మచారిణిని కదా? తమ చేతిక్రింద సహాయసేనానిగా నుండుట కంగీకరింపుడు.' అని సాగరానిక ప్రార్థించెను.

'ఇట్టి శౌర్యవంతులగు భార్యా పుత్రికలున్న నిక నాకేమి కొదువ? జయము నిశ్చయము.' అని ఖారవేలుడు సకుటుంబముగా ప్రయాణము చేయ నిశ్చయించెను.

ఇచ్చట యింతలోపల నిక ధాన్యకటకమున సైన్యములో చేరువారి సంఖ్యకు మితిలేదు. చేరినవారిలో నైదువేల బలః వరదానది సీమారక్షణమునకు వెడలెను. మిగిలిన సైన్యముతో చక్రవర్తి మజిలీలమీద గోదావరి యొడ్డునకు వచ్చెను. అచ్చట ఖారవేలుని సేనాని యామున కాహ్వానమునిచ్చి, సమస్త సే

కార్యముల నాచరించి, చక్రవర్తి రాకను ఖారవేలునికి తెలుప నొకదూత నంపెను. చక్రవర్తి లేనపుడు సామ్రాజ్య కార్యము లన్నియు నడపుటకు ముగ్గురు మంత్రులను కూర్చి యొక మంత్రాలోచన సభయేర్పాటయ్యెను. వారును ననుభవము గల రాజభక్తులగుటచే చక్రవర్తి యేవంక నిర్భయుడై యుండెను. ఖారవేలుడు చక్రవర్తి రాకనువిని యాయనకు స్వాగతమిచ్చుటకై రాజధానినుండి మూడామడల దూరము వచ్చెను. ఉభయులును కలిసి క్షేమసమాచారములు తెలిసి కొనిన తరువాత, నిక యాలస్యము చేయవద్దనియు, నిదియే ప్రయాణమనియు దంతపురమునకు కబురంపెను. ఖారవేల రాజకుటుంబ మప్పటికి చెప్పులలో కాళ్ళిడుకొని ప్రయాణ మునకు సిద్ధమైరి. దంతపురము చేరగనే స్త్రీజన ముభయ రాజులతో కలసెను. ఎప్పుడు చూతునాయని యువ్విళ్లూరుచున్న కుసుమలత సంతోషమునకు మేరలేదు. ఇట్లుభయసేనలు ముందున్న రాజపరివారమును వెన్నంటు చుండెను. వసంతకాలము. చల్లనిరాత్రులు. రాత్రులనక పగలనక సైన్యమంతయు నేకమై ప్రయాణము చేయుచుండెను. మార్గమధ్యమున పంటక్షేత్రములను ముట్టకూడదనియు, గ్రామములు లేని మార్గములవెంబడి ప్రయాణము చేయవలెననియు, సేనకు వలసిన సామగ్రియంతయు ద్రవ్యమిచ్చి కొనుక్కొనవలెననియు నుభయ ప్రభువులు గట్టియాజ్ఞల నిచ్చిరి. చిల్కాసర స్తీరమున నొకదినము మసిపిరెను. ఆనాడు సరస్సున పడవపైన రాజకుటుంబము ...ించెను. తర్వాత మహానదీ సైకతములను కాలిన నేదాటిరి. తదుపరి జగన్నాథ క్షేత్రమున స్వామిని సేవించి

దండయాత్రా విజయమునకై ప్రార్థనములనుసలిపిరి. కోణా
ర్క క్షేత్రమును సేవించిరి. సువర్ణ రేఖానదికూడ దండుకు జడిసి
యోయన త్రోవనిచ్చెను. ఇంతవరకును చేదిరాజ్యమే. ఇక
మగధరాజ్య సీమ యారంభ మయ్యెను. సీమ రక్షకులగు బల
గము లెదుర్కొనునని తలచిరిగాని యట్టిది జరగలేదు. అందుచే
పాటలీ పుత్రమువరకును వారు నిరాటంకముగ పోగలమని తల
చిరి. అచ్చటచ్చట కొండలలోనున్న యాటవిక జాతులవారు
భయపడి తమగుహలలో దాగుకొనిరి. ఆవంకగూడ నెట్టి
యాటంకమును కలుగలేదు. ఈవిధముగ దండు ముందునకు
సాగుచు దాదాపు పదియామడలదూరము గడచెను. ఇప్పటికే
మగధ సామ్రాజ్యములో చొచ్చినను యెట్టి యవరోధమును
కలుగకుండుటచే పాటలీపుత్రపు సరిహద్దువరకును నిట్లే నిరా
టంక ప్రయాణము జరుగునని తలంచిరి. వారనుకొని నట్లే జరి
గెను. గంగాశోణా నదుల యొడ్డున కొంత సమరమై ఖార
వేలసేనలు రెండు నదులను దాటెను. అచ్చట ఖారవేలుడు
తన దండును రెండుగా చీల్చి పాటలీపుత్ర నగరమును తూర్పు
నుండియు పశ్చిమము నుండియు రెండు పాయలుగా మండలా
కార రేఖగా ముట్టడించునట్లు వ్యూహము పన్నెను.

మార్గములన్నియు కట్టివేసిన నగరములోని రాజె
యాటికి పారిపోవ గలడు? ఒక వేళ నదులమీదుగా నౌ
కో పారిపోవ వీలులేకుండ నచ్చట కావలి యుంచెను. ప
ాదమునుండి గంగలోనికి సోపాన పంక్తి గలదు. ఖారవే
ా తకర్ణి సేనలు కోటను చుట్టుముట్టి యుండెను. అప్పుడు
యమునదిలేక ముందు కోటద్వారములన్నియు బంధించుటకును

యగడ్తపైనున్న వంతెనల నెత్తుటకును నాజ్ఞలిచ్చెను. తూర్పు నుంచి వ్యాపించిన సైన్యభాగమునకు ఖారవేలుడును, పశ్చిమమునుండి వ్యాపించిన దానికి శాతకర్ణియు నాయకులుగా నుండునట్లేర్పాట్లు జరుపుకొనిరి. ఖారవేలునితో నాయన భార్యయు, శాతకర్ణితో కుసుమలతయు నుండిరి. ఖారవేలుడు భార్యను జాగ్రత్తతో మెలగవలెననియు, తన యండ బాయవద్దనియు నాదేశించెను. కుసుమలత పురుష వేషముతో శాతకర్ణి కంగరక్షిగా నుండెను. కోటలోనెట్టి కలకలమును వినబడుటలేదు. ఇట్లు నిశ్శబ్దముగ నుండుటకు కారణ మూహింపజాలకుండిరి. కొందరు సైనికులను పట్టణములోనికంపి ప్రజలను భయపడవద్దనియు, వారికెట్టి యాపత్తులు రావనియు, కాని యింట్లు వీడి బయటికి రావలదనియు చాటింపించెను. అసంతుష్టులైన ప్రజలు రాజునకు శత్రువులేగాని మిత్రులు కాదుగదా? ఇట్లు కోటను, కోటచుట్టునున్న పట్టణమును ముట్టడించిన వెనుక ఆయుధాగారముకొరకు వెదకుట కారంభించిరి. ముందుగ గజసైన్యమును వెనుక గుఱ్ఱపు దళమును దానికి వెనుక పదాతి సైన్యమును నిట్లు వ్యూహము పన్నబడెను. అకస్మాత్తుగావచ్చి పడుటచే నితర స్థలములనుండి చతురంగ బలములను తెప్పించుటకుగాని వ్యూహము పన్నుటకుగాని పుష్యమిత్రునకు కాలము లేకపోయెను. ఒకవేళ తమంతటతాము దగ్గరనున్నకొన్ని బలములు వచ్చినను నవి నగరము చేరకుండ శత్రుసైన్యములు మధ్యనుండి యడ్డగించుట కలుగును. ధనాగారము కోటలోనే యుండెను. యుద్ధమునకు కావలసినది ఒకవైపున ధనము, రెండవవైపున నాయుధములు. ఇవి రెండును స్వాధీనములైన

విజయము నిశ్చయము. వెదుకగా నాయుధాగారము పట్టణమునకు
వాయవ్య భాగమున నున్నట్లు తెలిసెను. అది శాతకర్ణి యున్న
వైపు. శాతకర్ణి యచ్చటకు తన సైన్యము నందలి కొంత భాగ
మును పంపెను. అచ్చటయు నశ్రద్ధయే కనపడెను. ఆగార
మును శాతకర్ణిసేన చుట్టివైచెను. ఆయుధ సామగ్రి యంత
యు శాతకర్ణి వశమయ్యెను. బయటినుండి సేనవచ్చు నెట్టి
సూచనయు గానరాదయ్యెను. కోటలోని నిశ్శబ్దత యట్లే
యుండెను. చేది సైన్యములు నున్న వైపున రెండును, శాత
కర్ణి వైపున రెండు ద్వారములును కోటకుండెను. గంగలోని
కొక ద్వారముండెను. ద్వారములను ప్రవేశించుటకు సముద్ర
ప్రాయమై జలపూరితమైన యగడ్తను దాటవలయును. ద్వార
ములకడనున్న వంతెనలన్నియు నెత్తివేయబడెను. గంగా
నదీతీరమున కోటయొక్క ముఖ్యములైన రెండు బురుజులు
కలవు. వానినుండి చుట్టు నెట్లున్నదో చూచుచున్న కొన్ని
తలలు మాత్రము బయటకు కనబడుచుండెను. దిన మంతయు
రెండు వైపుల రెండు సైన్యములు త్రాళ్లతో వంతెనలను నిర్మిం
చుటకు యత్నించుచుండిరి. ఇంత సేన త్రాళ్ల వంతెనపైన
దాటుటయెట్లు? గజములును నశ్వములును దాటవలదా?
ఈదుటకు తగిన యవకాశములు లేవు. లోతుగానున్న యగ
డ్తకు సోపానములు లేకపోవుటచే తీరము చేరుట కష్టము.
ఇట్లూహించుకొనుచు దగ్గరనున్న కొన్ని వృక్షములను నరకి
వంతెన నిర్మించవచ్చునని నిర్ణయించిరి. రెండు వైపుల నొక్కొ
క్క ద్వారము చేరినజాలును. ద్వారకవాటము లయోనిర్మిత
ములై దుర్భేద్యములుగ నుండెను. లోపలికివారి యుపాయ

మేమియో యూహించుటకు సాధ్యము కాకుండెను. ఇట్లు పగలంతయు గడచెను. రెండువైపులను రెండుద్వారముల కడ బలమగు సైన్యభాగములనుంచి వంతెనకట్టుయత్నము లారంభమయ్యెను. బిగించు నయశ్శలాకల యొక్కయు దారుఖండములు కోయు రంపముల యొక్కయు శబ్దమును తప్పి యితర శబ్దమును వినబడదయ్యెను. ఆరాత్రియు నిట్లే గడచెను. మరునాడు రెండువంతెనలును పూర్తియయ్యెను. ఉభయసేనానులకును సైన్యమువచ్చెను. గంగాతీర ద్వారమును జాగ్రత్తగా కాపాడుటకై నమ్మకమై తెలివిగలిగిన సైన్యాధిపతి నచ్చట నుంచవలసి వచ్చెను. ఇంద్రశ్రీ యున్న బాగుండునని శాతకర్ణి తలచుచుండెను.

'ఇంద్రశ్రీ శౌర్యవంతుడేనా? అతను చిత్రకళాప్రియుడే గాని యుద్ధనిపుణుడని నేతలంపలేదు.'

'కుంచ నెంత చాతుర్యముతో నుపయోగింప గలడో కరవాలము నంత సులభముగా త్రిప్పగలడు.'

'అతను చాలకాలమునుండి కనబడుట లేదు.'

'ఆయనను పైఠణమున కంపితిని. అచ్చట సంగతులను నాకిచ్చటికి వచ్చి విన్నవించు మంటిని.'

'అందులకే కనబడుట లేదు.'

'ఈపాటికి వచ్చియుండవలెను. ఆలస్యమునకు కారణ మూహింప లేకున్నాను.'

'అచ్చటకూడ యెట్టి సంబాధమైనను సంభవించి యుండు నని నాయూహ'

'నాకు నదే యనుమానము. లేకున్న నీపాటికి రావలసిన వాండే యగును.'

ఇట్లనుచుండగా అశ్వారూఢుడై కతిపయ సైనికులతో నింద్రశ్రీ రానేవచ్చెను. గుఱ్ఱమును శిబిరద్వారమున నిలిపిలోనికి ప్రవేశించి చక్రవర్తికి మ్రొక్కి నిలచెను.

'ఇంత యాలస్య మెందులకైనది?' అని చక్రవర్తి ప్రశ్నించెను. 'ప్రభూ! తాము తూర్పునకు పోయిన సంగతివిని యగ్నిమిత్రుడు విజృంభించి వరదానది దాటుట కాయత్తుడయ్యెను. ఇంతలో మనరాజప్రతినిధి కా సంగతి తెలిసిముందు దాడి మనమే చేయుట యుక్తమని వరదానదిని దాట సైన్యమున కాజ్ఞనొసంగెను. వరదానదీ తీరముననుభయబలములకును దారుణ సంబాధమయ్యెను.' అని ఇంద్రశ్రీ ప్రత్యుత్తర మొసంగెను.

'తరువాత నేమైనదో విన మనంబు తత్తరపడుచున్నది.' యని చక్రవర్తి ప్రశ్నించెను.

'మనరాజ ప్రతినిధి స్వర్ణ శాతకర్ణి యెడ తెరపిలేని దాడులతో శత్రుసైన్యముల నొంచెను. ఇట్టి యొక సంబాధ సమయమున నగ్నిమిత్రుడు మనకు వశుడయ్యెను. మగధ సైన్యములు చెల్లాచెదరై పారిపోయెను. అగ్నిమిత్రుని కారాగారమున నుంచి స్వర్ణుడు వారి పరగణా నాక్రమించుకొని యిప్పుడక్కడ సేనాని భీమశ్రీని యేర్పాటు చేసినాడు. ప్రజలదివరకే మగధసామ్రాజ్యమున కుదాసీనులుగ నుండుటచే నావంక యెట్టి భయమునులేదు. దేవరకిది విన్నవించుటకు నన్నంపెను,' అని ఇంద్రశ్రీ వృత్తాంతమును నివేదించెను. శాతకర్ణి

యు, 'ఇట్లు చెదరైన సైన్యము సమకూరి మన వెనుకనుండి మనను ముట్టడించ వచ్చునుగదా' అని యడిగెను.

'తా మావంక సందేహింపవద్దు. ఒకవేళ యట్లు కొంత సేన వచ్చినను వారి నైతికబల మడుగంటినదనియే నమ్మవలెను.' అని ఇందుశ్రీ తెలుపగా కుసుమలతయు నిందుశ్రీ నభినందించి సేనదేర నియోగించెను.

'అనురక్తులగు రాజ సేవకులకు సేనయేందులకు?' అని కుసుమలతతో మనవిచేసి చక్రవర్తి వంకచూచి, 'ప్రభూ! వాదియొక మనవి, తమ యంగరక్షకులలో నొకనిగా నన్నంగీకరింపుడు' అని వేడకొనెను. చక్రవర్తియు నందుల కంగీకరించి యాతనిక్రింద కొంతసేనయుంచి యుద్ధమున పాల్గొనుట కనుజ్ఞ నొసంగెను. ఇందుశ్రీయు నందులకు మిక్కిలి సంతసించి యుద్ధకార్య నిమగ్నుడయ్యెను.

ఆదినముకూడ నట్లే గడచెను. ఇరు పక్కలను సంచలనము గానరాదు. ప్రొద్దుగ్రుంకెను. కోటలో కలకలము కొంచెముగ వినబడుచుండెను. వంతెనలు రెండువైపుల సిద్ధమయ్యెను. కోటకున్న యేయోవయి ద్వారము నెట్లు పగులగొట్టుట? యుద్ధనీతి నిపుణులగు ఖారవేల శాతకర్ణు లప్పుడప్పుడు కలసి యాలోచనలు సల్పుచుండిరి. ఆయుధాగారము నష్టమైనందుల కుభయులును సంతసించిరి. గొప్పసేన బయట ముట్టడించి యుండ, యాయుధములులేక, పురమునందలి యాహార పదార్థములన్నియు శత్రువశమై, యెంతకాలము కోటలోనివారు గంభీరించి యుండగలరు? అయిననునిదివరకుచేర్చిన సంభారము లున్నంత కాలము ముట్టడి కాగగలరు. కానీ చూతము,

అయినను నాలస్యమగు సూచనలు కనబడునెడల గోడలు త్రాటి నిచ్చెనలతో నెక్కి కోటలో ప్రవేశించవలెనని యుభయ సేనానులు నిశ్చయించుకొనిరి. కోటలో కలకలము హెచ్చ సాగెను. ఏమిటాయిదియని నాము చెవులతో నిందుశ్రీ గోడ కొంచి యున్నదున్న కంతనుండి వినసాగెను. ఏమి వినెనోగాని గొబ్బున చక్రవర్తి యొద్దకు పరుగెత్తుకొని వెళ్లెను.

## పదునాలుగవ అధ్యాయము.

'ఏమది! ఇందుశ్రీ పరుగిడుచు వచ్చుచున్నాడు.'

'ఏదేని యొక ముఖ్యసమాచారమై యుండును.'

'ఏమోయి ఇందుశ్రీ! అట్లు పరుగిడుచు వచ్చుచున్నావు?'

'ప్రభూ! నేను కొన్ని రహస్యములను వింటిని. వాటిని తమకు నివేదింప వచ్చితిని.'

'ఏమిటవి? సత్వరముగ తెల్పుము.'

'ఇక 4 దినములకు మాత్రమే కోటలో నాహార సంభారము లున్నవట!'

'ఇంకేమి! మనకే విజయము!'

'మరియొక యంశము. ఆ మిగిలిన సంభారములను స్త్రీ జనములకు వదలి కోటలోని సైనికులే తెల్లవారుజామున ద్వారములను తెరచుకొని మన సేనలను ఛేదించుకొని యావలకు పోవ నిశ్చయించుకున్నారు.'

'మరి పుష్యమిత్రుని మాట యేమైన తెలియవచ్చెనా?'

'పుష్యమిత్రుడు గంగానదిలో నొక పడవపై నవతలి యొడ్డునకు దాట సన్నాహములు జరుగుచున్నవి. ఇది నేను

రహస్యముగా కుడ్య కుహరముసుండి వింటిని, దేవరకు విన్న వింప వచ్చితిని.'

'నీవి పాముచెవులోయి, ఇందుశ్రీ! మనమేమి చేయ వలెనని నీయూహ?'

'ఆ! గంగానదివద్ది దిడ్డికంతను కాపాడుట మొదటి కార్యము. ఆ దిడ్డి ద్వారమునకు దగ్గరనున్న పడమటి బురుజు నెక్కి కోటలోన ప్రవేశించుట రెండవది. మనము కట్టిన వంతెనలను కూలద్రోయుట మూడవది.'

'వాని వలన ప్రయోజనములే యుండును?'

'దిడ్డి ద్వారము వెలుపల మనకావలి వారును బురుజు మీదినించి దిగు మనసైనికులును కలిసి మధ్యనున్న చక్రవర్తిని పట్టుకొనుట కవకాశముండును.'

'వంతెనలను కూలద్రోయుట వలన ప్రయోజనమును వినగోరు చున్నాను.'

'ద్వారములు తెరచుకొని పారిపోవ యత్నించిన శత్రు సైన్యము లగడ్తలను దాటవలసి యుండునుగదా! ముందు నుంచి మనమును బురుజుపై నించి రెండవవైపున దిగుచున్న మన సైనికులు వెనుకవైపున నుండియు, ముట్టడింపశత్రుసైన్య మడకత్తెనందలి పోకవలె నశించును. వెనుక మన సైన్యము ముందగాధమైన యగడ్త. ఇదివరకున్న వంతెనలను వారే పడ ద్రోసి కొనిరి. ఈదుకొని వచ్చినవారిని మనసైనికులు సులభ ముగా బరిమార్ప గలరు.'

'కోటలో నేమాత్రము సైన్యమున్నది యేమైన తెలు వదా?'

'అయిదు వేలకంటె మించియుండదట!'

'ఇందు నీవే కార్యమును నిర్వర్తింతువు?'

'ఇట్లు వారిద్దరును మాటలాడుకొనుచుండగా-

'నన్ను మాత్రము మరువవలదు. నన్నును నొక కార్య మున నియమింపుడు' అని కుసుమలత యనెను.

'నీవు నాకు ముఖ్యాంగ రక్షకివిగదా!' యని చక్రవర్తి నవ్వుచు ననెను.

'తా మెచ్చటనున్న నేనచ్చట నుందును.' అని యామె జవాబు చెప్పెను.

'నేను పశ్చిమ ద్వారములు రెండును కాపాడుదును. తూర్పు ద్వారములను చేది సైన్యములకు వదలుదము. తా బురుజుపై కెక్కగలరు. కాని యన్నిటికంటె కష్టమైన కా మదే కావున నాపనికి తాముగాక మరి యెవ్వరైన బాగుండ దని మనవి.' అని ఇంద్రశ్రీ యనెను.

'అదియే యన్నిటికంటె ముఖ్యమైనపని. వలన మగధ చక్రవర్తిని గ్రహింపవచ్చును.' అని శాతకర్ణి యనగా కుసు మలతయు,

'నాయభిమతమునదే! నేను బయట కాచుచుందు లోపలినుంచి తాము వెంబడించిన బోనులోని యెలు చక్రవర్తి మనకు వశుడగును.' అనెను.

'ఈ నిర్ణయమైన వెనుక వారందరునుచేరి ఖార శిబిరమునకుజని యచట నీనిర్ణయమును గట్టిచేసుకొని వచ్చిరి. కోటలో నన్నివైపులను కలకలము కొంచెము క ముగ హెచ్చుచుండెను. ఏడ్పులు వినవచ్చుచుండెను.

రవములు చెలరేగెను. ఇది యేమియని కనుగొనుటకు వ్యవధానము లేదు. అర్ధరాత్రము గడచెను, తెల్లవారుజాము కావచ్చెను. నిర్ణయానుసార మెవరిస్థానముల వారుండిరి. ఇక బురుజు నెక్కవలయును. అందులకై శ్రీరామసేనవలె చెకచెక నెగబ్రాకగల కొందరు సైనికులు ముందునకు వచ్చిరి. కోటగోడలలో చిన్నచిన్న బొరియలు చేసి త్రాటి నిచ్చెనలను గొని యధిరోహింప నారంభించిరి. గుఱ్ఱముపైన మనుష్యుడును నాయన భుజములపైన మరియొకడును, ఈవిధముగా నొక వ్యక్తి బురుజుపై నెక్కెను. ఇక నేమియున్నది? అంతయును సులభమే! త్రాటి నిచ్చెనలపై నుండి వరుసగా చీమల బారువలె సైనికులు గోడల నెగబ్రాకి బురుజుపైకి వచ్చుచుండిరి. ఇట్లు దాదా పైదువేల సైనికులు వచ్చియుందురు. ఇటులే తూర్పువైపు బురుజుల నెక్కుటకింక కొంచె మాలస్యమైనది. క్రమముగా నీ సైనికులు మెట్లు దిగ నారంభించిరి. ఈవచి జరుగునని కోటలోని సైనికు లూహింపక పోవుటచేత వారందరును నాల్గు ద్వారములకడ బైటికి పోవలెనని గుమిగూడి యుండిరి. శాతకర్ణి తాను మాత్రము నదివైపున నున్నదిడ్డి వద్దకు కొలది మందితో వెళ్లుదునని తెలిపి ద్వారములకడ మూగియున్న సైనికులపై శరవర్షములు గురిపించుడని మిగిలిన వారికి చెప్పి నల్గురదండనాయకుల నియమించి, తానుదిడ్డివద్దకు పోవుచుండగా నొక్కడే సైనికుడు సహాయము రాగా నొక యుజ్వల పురుషుడు దిడ్డిద్వారము తలుపు తీయుచుండెను. 'ఎవరువారు? నిలువుము నిలువుము!' అను కేకలు వెనుకనుండి వినబడగా నాపురుషుడు నిర్విణ్ణుడై తలుపు తెరవబోయెను గాని

చేతులు తడబడగా తాళములో చెవిపడలేదు. 'భయములేదు.
జాగ్రత్తగా తెరువుము.' అని శాతకర్ణి మందలించెను. ఆయన
యు నెట్లెట్లో తలుపు తీయ, తలుపున కెదురుగా సైనికవేష
మునను్న కుసుమలత యెదురయ్యెను. ఆమెయు 'చేత కత్తి
యున్న పారవేయుము! లేకున్న ప్రాణములు నిలువవు.' అని
సింహగర్జన మొనరించెను. ఆవ్యక్తివద్ద యెట్టి యాయుధము
నులేదు. కాని ప్రక్కనున్న సైనికునివద్ద నుండెను. ఇక ప్ర
యోజన మేమియు లేదని యాతడును కత్తిని విసరి గంగానదీ
జలముల బారవైచెను. నిరాయుధుడైనవ్యక్తి మగధచక్రవర్తి
యగు పుష్యమిత్రునిగా తెలిసికొని, 'ఆడుదానివలె పారిపోవు
చుంటివా?' యని శాతకర్ణి యీసడింపుతోనని, 'దండనా
యకా! ఈతని నీ స్వాధీనమునం దుంచుకొనుము!' అని కుసు
మలత కాజ్ఞాపించెను. ఆమెయు నిద్దరు సైనికుల కాయనను
బంధించుట కాజ్ఞాపించెను. ద్వారముకడ నున్న సైనికుల
శాతకర్ణి సైనికుల బాణాగ్నులకు గురియైరి. కొందరు దా
ములు తెరచుకొని బయటపడ యత్నించిరి, కానివారు బం
వారిచే బాణాహతులైరి. ఖారవేలుని సైన్యములు బురు
నెక్కక పూర్వమే శాతకర్ణి సైనికులు సర్వకార్యములను ని
ర్వర్తించిరి. పట్టువడిన పుష్యమిత్రుని శాతకర్ణి తన శిబిరము
తీసుకొని పొమ్మని కుసుమలత కాదేశముల నిచ్చెను. ఎం
కాలము పట్టునో ఎంత జననష్ట మగునో యని తలంచిన
ర్యము నష్టమెక్కువ లేకుండసులభసాధ్య మయ్యెను. పె
పట్టణము ఖారవేల శాతకర్ణిసేనల యధీన మయ్యె
ప్రజలెట్టి యలజడిని పొందవలదనియు, నెవరి కా

వారు నిర్నిరోధముగా కావించు కొనవచ్చు ననియు పట్టణ మంతయు చాటబంచెను. కోటలోనున్న స్త్రీజనమును వదలి వేసిరి. వారును తమవారివద్దకు పోవచ్చునని యనుజ్ఞాతలైరి. పుష్యమిత్రుని గృహిణి మాత్రము తన భర్తవద్దకు చేర్చుమని బ్రతిమాలెను. శాతకర్ణి యందులకు సమ్మతించెను. ఎన్ని హ స్తములు మారినదో మగధరాజ్య లక్ష్మి! ఎంత చంచలయో! ఇప్పుడు చేదివంశ మామెకు ప్రియమైనది. కాని యిచ్చటనైనను సుస్థిరముగా నుండునో లేదో!

ఇక విజయ మెవ్వరిది? ఖారవేలునిదా? శాతకర్ణిదా? చక్రవర్తిని పట్టుకున్న కుసుమలతాదేవి ఖారవేలుని కొమరిత. ఇంతవరకును శాతకర్ణికి నామెకును స్నేహ సంబంధము గాక మరెట్టి యితర సంబంధము లేదు. కావున ఖారవేలుని పుత్రీ జయము ఖారవేలుని జయముకాదా? తుదకిందరు పోటుబంటు న్నను మగధచక్రవర్తిని పట్టుకొనిన కీర్తి యొక స్త్రీకి దక్కినది' ఇందులకై దండనాయకు లందరును లజ్జించిరి. గాని ఖారవేలున కది గర్వ కారణమయ్యెను. కుమార్తెను బిలచి, 'తల్లీ! పురు షులైన మమ్మందరిని లజ్జాపజేసితిరి. అయినను నాకొమరిత విజేతయని చెప్పుకొనుటకు గర్వపడుచున్నాను.' అని కుమార్తె చుబుకమునుబట్టి బుజ్జగించెను.

తల్లియు కుమార్తె నాలింగనము చేసుకొని యామెపరా క్రమమునకు కొనియాడి వీరమాతవు కమ్మని దీవించెను.

'తల్లీ! నాగవాసుకుడు, అతని తల్లికిని మాపై కోపము వచ్చినది. అతనికినీవు భార్యవగుటకు సమ్మతించియుందువా?' ని సాగరానికా దేవి సోపాలంభముగా నడిగెను.

'అమ్మా! అది యిప్పు డెందులకుగాని చక్రవర్తి బడలి యున్నారు. వారికి తగిన యుపచారములనుచేసి వారు సేదదేరిన వెనుక నాకు చేకూరిన విజయమునుగూర్చి మనవి చేతును.' అని సవినయముగా బలికెను.

విజయము స్థిరమైనది. కోట గుమ్మములవద్ద రక్షకభటులు నియమింప బడిరి. సాయంకాలము ఖారవేలుని మందిరమున నందరును సమావేశమైరి. శాతకర్ణి కొంచె మలసినట్లు కనుపట్టెను. పగలు కొంత నిద్రపోయినను బడలిక యింక తీరలేదు. శాతకర్ణి వరదా నదీతీరమున జరిగిన సంబాధమును, ఇ దుశ్రీ తెచ్చినవార్తలను, ఖారవేలునకు తెలిపెను. ఆయనయు నందులకు బ్రహ్మానంద భరితుడయ్యెను. పుష్యమిత్రుని సభకు తీసుకుని వచ్చిరి. ఆయనకు ఖైదీయైనను రాజమర్యాదల నొసంగిరి. భవిష్యత్తులో తానేమి చేయ దలచినదియు నాయన నడిగిరి. ఆయనయు పరిపాలనము తనకు విసుగు గొల్పినదనియు తనకు చక్రవర్తిత్వము కంటె సేనాపతిత్వముపై నెక్కువ యిష్టమనియు నివేదించెను. కాని శత్రువున కట్టి పదవి నిచ్చుట కిష్టములేక ఖారవేలు డాయనవిషయమై యేమి చేయ నెంచినదియు శాతకర్ణి నడిగెను. శాతకర్ణియు తన సహజౌదార్యమునకు తగినట్లు పుష్యమిత్రునకు కొం యాదాయమువచ్చు సంస్థానమునిచ్చి యాయన జీవితకాల శాంతముగా జీవనమును గడుపుట కవకాశము కల్పింపు చెప్పెను. ఖారవేలుడును నట్లేయని యాయనకొక చిన్న స్థానమునిచ్చి యాదంపతుల నంపివేసెను. రాజ్యవ్యవస్థయు తయు చాణక్యరాజనీతి ననుసరించి యున్నందున దానిని ఖా

రవేలుడు తాకలేదు. తరువాత పుష్యమిత్రుని పట్టుకున్నకీర్తి యెవరికి దక్కవలెను అను ప్రశ్నవచ్చెను. శాతకర్ణి కుసుమలత వైపునకు తిరిగెను.

'నేనట్లే యన్నను మా అమ్మాయి యొప్పుకొనలేదు. నిజము వినదలచినాను' అని ఖారవేలుడనెను. అప్పుడు కుసుమలత శాతకర్ణి బురుజుపై నెట్లు ప్రాకినదియు, తలుపు తీసుకుని వచ్చుచున్న పుష్యమిత్రుని నెట్లు వెంబడించి నదియు తెల్పి, యాదిడ్డికంతవద్ద నిమిత్తమాత్రముగా తాను ముందుట చేత యెల్లరును తానె పట్టుకున్నట్లు భ్రమపడిరనియు విన్నవించెను. సత్యము తెలిసి ఖారవేల దంపతులు తప్పక యిట్టివ్యక్తి తమ కుమార్తెకు తగునని నిశ్చయించుకొనిరి.

## పదునాలుగవ అధ్యాయము

ఇక రెండు కార్యములు మిగిలినవి. మొదటిది సామ్రాజ్య విభాగము. రెండవది కుసుమలత పాణిగ్రహణము. రెండవదానికెట్టి యాటంకములును లేవు. కాని మొదటిది క్లిష్టసమస్యయే. ఇదియెట్లు జరగవలెనా యని ఖారవేలుడాలోచనలో మునిగిపోయెను. ఇందనేక రాజకీయ సమస్యలిమిడియున్నవి. తాను స్వయముగానే దండయాత్రను సాగించి విజయవంతుడైనయెడల నెట్టి సమస్యయు ఉండెడిది కాదు. అట్లు కాలేదు. పైపెచ్చు శాతకర్ణి సహాయము చేయుటయేగాక విజయము సాధించినవాడయ్యెను. ఇదియొక సమస్య. తనకేక పుత్రిక. పుత్ర సంతానము లేదు. తన తరువాత తన రాజ్యమేమగును?. ని విజేతలకాంక్షము. తాను విజేతయై రాజ్యముసంపాదించెను.

నిక నాకు సెలవిప్పించిన నేను ధాన్యకటకమునకు వెడలుదును'
అని శాతకర్ణి యభ్యర్థించెను.

'అక్రూర దీనిసతరువాత వెడలగోరిన నంతటి కృతఘ్నుడ
నేను కాను. కావునరాజ్యవ్యవస్థచేసి మరీవెడలవలెనని నా కోరిక'
అని ఖారవేలుడనెను.

'అంతకును తమరే పెద్దలున్నారు. మీకు తెలియని
శాస్త్రము లేమున్నవి?' అని శాతకర్ణి సమాధాన మిచ్చెను.

'నా కేకపుత్రిక. మరియెవ్వరును లేరు. ఆమెయు
మిమ్ములను వరించియున్నది. అందుచే మీరును మాకాప్తులై
తిరి. ఈ సంబంధము మీ మాతృశ్రీగారును తమ జీవితకాలము
లోనే జరుగలేదను విచారము వెలిబుచ్చినట్లు వినికిడి. ఇట్లు
నేనును, నటు మీతల్లిగారును నీ సంబంధమునకై తపసుధాన
జేసినాము. అందుల కమ్మాయి మనస్సుకూడ మీయందు
లగ్నమైయున్నది. అన్నియు కలిసినవి.'

'తమరు కానిమాటల నాడుదురా? తమ హృదయము
నాని యభిప్రాయము వివాహమే యగునెడల నేను హృద
యపూర్వకముగా సమ్మతించితిని.' అనుచు కుసుమలత వైపు
నకు చూచెను. ఆమెయు సిగ్గుతో తలవంచి యూరకుండెను
గాని కనుకొలకులు శాతకర్ణిపై తీక్ష్ణబాణములను విసరుచునే
యుండెను.

'ఒక విషయము తేలినది. ఇక సామ్రాజ్య విభాగము
నకు విషయము.'

'అందును మీయాజ్ఞకు బద్ధుడను. ఏలన మొదటి విష

యము నంగీక రించుటతో మీరు నాకు శ్వశురులైతిరి.' అని శాతకర్ణి యనెను.

'మీరు నాయందు చూపిన గౌరవమునకు గర్వపడు చున్నాను. అయినను వ్యవహారమునకును బాంధవ్యమునకును సంబంధముండ కూడదు. అట్లున్న నేదేనొక దానికి భంగము వాటిల్లవచ్చును.' అని ఖారవేలుడు పలికెను.

'నేను రాజ్యకాంక్షచే మీకు సహాయము రాలేదు. తాము నాకాప్తు లగుదురనియు, తమ దండయాత్రకు సహాయముచేయుట ధర్మమనియు వచ్చితిని. తరువాత నిర్ణయము మీయది.' అని శాతకర్ణి యనినప్పుడు ఖారవేలు డాయన నిస్వార్థమునకు పరమానందము నందెను.

'ఇక నొక్కమాట యున్నది. ఇప్పుడు మన యిర్వురి రాజ్యములును గంగా తుంగభద్రాతీరముల నంటియున్నవి. మన సామ్రాజ్యములు నిస్సపత్నములు. నాయనంతరము నాసర్వస్వము మీయదియే! మీరిదివరకే సామ్రాజ్య శాస్త్రులై చక్రవర్తులై యుంటిరి. నేనును కొంతకాలము దాని ననుభవింప నువ్విళ్ళూరు చున్నాను.' అని ఖారవేలుడు పల్కినప డాయన స్వరమున కొంచెము దైన్యము కనపడెను. శా కర్ణి యేమనునోయని కుసుమలతయు నాయమ తల్లియు ఆ తురతను చూపుచుండిరి.

'పెద్దల యభీష్టమును నెరవేర్చుట పిన్నలవిధి. యభీష్టమే నెరవేరుగాక! నాకును నూతన సామ్రాజ్య కంటె ప్రాంత సామ్రాజ్యమే యెక్కువ ప్రియము' అని శా కర్ణి స్పష్టముగాననెను. అప్పుడు ఖారవేలుడు తన కుమా

ఈ శుభహస్తమును శాతకర్ణి హస్తమునకుంచి 'ఈశుభదినమున నాకుమార్తెను నీకుపరిణయ మొనర్చి నాచేదిరాజ్యము నామె కరణముగా నిచ్చుచున్నాను.' అనెను.

తరువాత తాను వ్రాసిన శాసన పాఠమునుచూపి శాతకర్ణి యంగీకారమును బడసెను. ఆ శాసనమిప్పుడు హాథిగుంఫ శాసనమని పిలువబడుచున్నది.

## ఉపసంహారము

ధాన్యకటకనగర మలంకరింపబడు చుండెను. చక్రవర్తి భార్యా సహితుడై ధాన్యకటకమునకు వచ్చుచుండెను. ప్రజలు మహోత్సాహముతోనుండిరి. రచ్చలు రాజమార్గములు, గృహాంగణములు, రత్నతోరణములతోను, రంభాస్తంభములతోను, పూర్ణకుంభములతోను, నారికేళ ఫలములతోను నలంకరింపబడెను. శాతకర్ణిని భార్యాసహితముగా చూడవలెనని తండోపతండములుగా ప్రజలు గుమికూడి యుండిరి. పట్టణాపీఠమునకడకు మంత్రులు, సామంతులు, పురోహితులు పోయి చక్రవర్తికి స్వాగతమిచ్చి పట్టణములోనికి తీసుకుని వచ్చిరి. చక్రవర్తి భార్యా సహితుడై లక్ష్మీనారాయణునివలె ప్రకాశించెను. ప్రజ లిట్లనుకొనిరి.

'నాగానికా మహారాజ్ఞి కోరిక ఫలించినది!'

'నేటికి రాజదంపతులను గంటిమి!'

'కుసుమలతా దేవి యదృష్టము. ఇట్టి చక్రవర్తిని భర్తగా బడసినది.'

'నాగానికా మహారాజ్ఞి బ్రతికియే యుండిన నెంత
చెడిదో!'

ఇట్టి వాక్యములు పరశ్శతముగా ప్రజలు చెప్పుకొన
ి. ఉత్సాహవంతుడైన వెనుక చక్రవర్తి రాజసూయయా
యము నిశ్చయించుకొనెను. అందులకై రాజ్యము నిస్స
ంగా నుండుట యవసరము. తన యభిప్రాయమును
గారికి పాటలీపుత్రమునకు తెలిపెను. ఆయనయు సంత
. మాళవాధీశుడు కొంచెము కొండి యాడించుచు
విని పైఠనునందలి రాజప్రతినిధికి కొంతసేనను సహా
గా నంపి యతనిని లోబరచుకొనెను. గంగానదీ తీరము
తుంగభద్రా తీరమువరకును సామ్రాజ్యము శత్రువులు
నిష్కంటక మయ్యెను. దక్షిణము నందలి పాండ్య
దేశ రాజులు శాతకర్ణి నెదుర్కొనలేక మిన్నకుండిరి.

ఆశ్వయుజ శుద్ధదశమి పవిత్రదినము. దానిని విజయదశమి
రు. ఆ దినము శాతకర్ణి భార్యతో పీటలమీద నాసీను
జసూయయాగ మొనర్చెను. పాటలీపుత్రము నుండి
గారగు ఖారవేలుడు కట్నములను నాశీర్వచనములను
ు. మాళవ సౌరాష్ట్ర దేశాధీశులు స్వయముగావచ్చి
ర్తికి జోహారులొనర్చిరి. పాండ్యచోళ రాజులును
కాంక్షలనంపిరి. ఆసమయమున చక్రవర్తి యిచ్చిన దక్షి
ము, చేసిన గోదానాది దానములకును మేర
ఉద్యోగుల కందరకును నొక సంవత్సర భృతిచి

యవనాక్రాన్తి. ద్రోహులకు కరములను వదలి వేసెను. సా
మ్రాజ్యమునందలిజను సంతసించని జనులులేరు. భట్టారకులు
దినదినము పరమానసఫలము చేకొంటిమని సంతసించిరి. సామ్రా
జ్యప్రసిద్ధి దేశదేశముల ప్రచురమగుటకు నాసికలో నొక
శాసనము చేయబడెను. ఇందు శాతకర్ణి విజయములను వ్రా
సిరి. త్రిసముద్రతోయపీతవాహన దక్షిణాపథాధిపతియని బిరుదము
నొసంగిరి. దక్షిణాపథమునకిక రాజులేలేరు. చేది రాజ్యము
శాతకర్ణి వశమాయెను. యావద్భారత దేశమందు గూడ
నాటికాల శాతకర్ణులదే యావద్రాజ్యము. పశ్చిమమున తక్ష
శిలనుండి తూర్పున బ్రహ్మపుత్రా నదివరకును, నుత్తరమున
గంగాతీరమునుండి తుంగభద్రాతీరము వరకు సీమాముల్లుండ్లు
దేశమును పంచుకొనిరి.

శాతకర్ణి సామ్రాజ్యమున పరమతబాధ యనునది కా
నము. ఆతడు వైదికధర్మానుసారియైనను సర్వ మతములను
సమానముగా చూచెను. అన్ని మతసంస్థలకు నుపాయ మొన
ర్చెను. ధాన్యకటకమునందలి స్తూపమునకు నూతనాలంకార
ములను చేయించెను. మామగారు జైనుడైనను మామల్లుండ్ల
కష్టించను పూనలేదు. కుసుమలతాదేవియు భర్తకు సహ
ధర్మచారిణియై సమస్త విషయములలో నాదర్శ గృహిణి
యని పేరుగాంచెను. ఇందుశ్రీ యాస్థానశిల్ప కార్యములలో
నిమగ్నుడయ్యెను.

'ప్రభూ! సాంచిస్తూపమునుగూర్చి జ్ఞాపకము చేయుట
కనుజ్ఞ వేడుచున్నాను.'

'నాకు జ్ఞాపకము లేదనుకుంటివా? అప్పుడా ప్రదేశము
శత్రుహస్తములలో నుండుటచే సంకోచించితిని.'

'చిత్తము. ఇష్టు డనుజ్ఞయైనచో తమయాజ్ఞను శిరసా వహింతును.'

'అమరావతీస్తూపము పని పూర్తి యైనదా?'

'త్వరలోనే యగును.'

'అయిన వెంటనే.. నీవు పాటలీ పుత్రమునకు వెడలి యచ్చట మాక్షేమ సమాచారము మామగారికి నివేదించి యచ్చటనుండి యధికారములను గొని సాంచీలో పనిప్రారంభించవలెను.'

ఇట్లను చుండగా కుసుమలతాదేవి వచ్చి ఇందుశ్రీని లోనికి పిలచిచక్రవర్తినిగూడ రమ్మనెను. ఎందుకోనని లోనికి పోయిరి. ఆమె వారిని శయన మందిరములోనికి గొనిపోయి గోడకు తగిలించిన రెండు చిత్రములను తాను వానికి చేసిన యలంకారములను వారికి చూపెను. అందరు నొకరి నొకరు చూచి నవ్వుకొనిరి. ఇన్ని కష్టసుఖములలోను వారిద్దరును నీ రెండు చిత్రములను ప్రాణపదముగా కాపాడిరి. పాఠకులకీ చిత్రము లెప్పటివో తెలిసియే యున్నది.

'ఇందుశ్రీ! రాజసూయయాగ చిత్రము నాకు కావలయును. వేసి యిత్తువా.?'

'అమ్మా! నన్ను మీరు ప్రశ్నింపవలెనా? ఆజ్ఞయైనచో చిత్రమునువేసి యిచ్చియే సాంచీకి వెడలుదును.'

'నాదొక యభిప్రాయము కలదు. వెనుకటి రెండు చిత్రములును మిక్కిలి యందముగనున్నను, ముఖవర్చస్సున నాందోళనము కనబడుచున్నది.'

'నిశ్చయమేకదా? అమ్మా! అప్పుడు మీరిద్దరును నాందోళనలోనే యుంటిరికదా?'

ఇట్లుండగా నదివర కూరకున్న చక్రవర్తి,

'అయినను, మాధ్వర్యము గోచరమగు నాచిత్రమే నాకు ప్రియమై యున్నది.' యనెను.

'మనసున నెంతభావమున్నను దాచుకొన గలిగినప్రశాంత భావముమీచిత్రమున నాకునచ్చినది' అనికుసుమలతాదేవిఅనెను

మహారాజ్ఞి కోరిక నెరవేర్చి ఇంద్రశ్రీ పాటలీపుత్రమునకు పయనమై ధాన్యకటకపు క్షేమ సమాచారమును వారికి తెలిపెను. కుమార్తె సామ్రాజ్ఞియైనందులకు వారమితానందము నందిరి. అచ్చట నింద్రశ్రీకి వలసిన యధికార పత్రములనిచ్చి సాగనంపిరి. శిథిలద్వారములను సర్వసుందరములుగా చేసి. వాటి చిత్రములను వ్రాసుకొని ఇంద్రశ్రీ మరలివచ్చి యాచిత్రములను చక్రవర్తికి చూపెను.

'బాగుగనే యున్నవి కాని, నాపేరేల చెక్కితివి?'

'ప్రభూ! క్షమించ వలెను.'

'మహా నిర్మాణము లనబడువాని నిర్మాత లెవరో తెలియదు. అట్టియెడ చిక్కడమాత్రమునామమేల యుండవలెను?'

'నాహృదయమునందలి రాజభక్తినన్ను పురికొల్పినది. అంతకంటె వేరుసమాధాన మియ్యలేను.'

'చిత్రించిన నీనామధేయ మంతకంటె యవసరము.'

'అది యవినీతి. మేమందరమును తమ ఛత్రచ్ఛాయ క్రింద జీవించుచున్న పక్షులము. మాకు ప్రత్యేకత లేదు.'

'అట్లు వలదు. ప్రజల తుష్టియే రాజునకు రక్ష.'

'పాటలీపుత్ర విశేషము లేమి?'

'అందరు సుఖులే! మామగారు తమ కాశీర్వచనముల నంపినారు.'

శాశ్వత కీర్తిరస్తు.